# అవినీతే పేదరికానికి కారణం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

నేను ఆయన పేరు మరచిపోయి ఉండేవాడినే, హరారే సమావేశానికి, క్యాస్ట్రో వంటి నియంతలని వదలి వేస్తే, దాదాపు వంద మందికి పైగా ప్రధాన మంత్రులు, దేశాధ్యక్షులు హాజరైనారు, కానీ బంగ్లాదేశ్ అధ్యక్షుడు ఎర్షాద్ మాత్రం ముగాబే దేశానికి వెళ్ళటానికి తీరిక లేకుండా ఢాకాలో డబ్బు లెక్క పెట్టుకుంటూ ఉండి ఉంటారు. లండన్ వారపత్రిక ఒకటి రాసిన దానిని బట్టి ఎర్షాద్, ఆయన భార్య 10 కోట్ల రూపాయలకి పైనే విదేశీ బాంక్‌లలో కూడ బెట్టారట. అందులో ఎక్కువ భాగం విదేశీ ఒప్పందాల వల్ల లభించినటువంటిదేనని ఆ పత్రిక పేర్కొన్నది. సెక్స్ వ్యవహారాలలో కూడా ఎర్షాద్‌కి సంబంధాలు ఉన్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో డబ్బు, సెక్స్ ఒక దానితో మరొకటి ముడిపడి ఉంటాయి. భుట్టోకి కూడా అలాంటి సంబంధాలే ఉండేవి. అదే విధంగా ఫిలిప్పయిన్స్‌కి చెందిన మార్కోస్, ఇరాన్ రాజులు కూడా. అయితే ఎర్షాద్ వ్యవహారానికి వాటికీ కొంచెం తేడా ఉన్నది.

ప్రపంచంలో అతి పేద దేశం బంగ్లాదేశ్. అంతర్జాతీయంగా ఆ దేశానికి పరపతి అన్నది లేకుండా పోయింది. బంగ్లాదేశ్‌కి డబ్బు ఇవ్వనటువంటి అంతర్జాతీయ సంస్థ లేదు. అది అయిక్యరాజ్య సమితి అయినా, ప్రపంచ ఆరోగ్య సంస్థ లేదా ప్రపంచ బాంక్ అయినా ఢాకా అప్పు తీసుకోని సంస్థ, దానం అడగని దేశం ఉండటం అన్నది అరుదు. అది అతి పేద దేశం, బహుశ ఇంతకు ముందుకన్నా ఇప్పుడు మరి పేదది. ఎందుకంటే ఆ డబ్బంతా ఎర్షాద్ బృందం చేత స్విట్జర్లాండ్, తదితర చోట్ల గల నెంబర్ ఖాతాలలోకి వెళ్ళి పోయింది. పది కోట్ల రూపాయలన్న ఆ సంఖ్య పైనే నాకు అనుమానంగా ఉన్నది. అది చాలా చిన్న మొత్తం. తృతీయ ప్రపంచానికి చెందిన ఏ నాయకుడైనా తన దోపిడిని రెండు అంకెల సంఖ్యతో నే ఆపేటంత తెలివి తక్కువ వాడుకాదు. అది కనీసం మూడు అంకెలలో నే ఉంటుంది. అంతకు తక్కువైతే అది వాళ్ళకి బఠానీల వంటిదేనని అనుకోవాలి.

మరి హరారేలో వాళ్ళు చెప్పినది ఏమిటి? తృతీయ ప్రపంచం అప్పు గురించి ముగాబే చేసిన బ్రహ్మాండమైన ప్రకటన ఇలా ఉన్నది : అభివృద్ధి చెందుతున్న దేశాల సార్వభౌమాధికారాన్ని, స్వాతంత్ర్యాన్ని కబళించటానికి తయారైన రక్కసి వంటిది ఈ అప్పు. ఒక దాని తర్వాత ఒకటిగా అది పేద దేశాలని కబళించటానికి అనుమతించ కూడదు.

తటస్థ దేశాల సమావేశంలో ముగాబే తమ సహచరులకి చెప్పనిది, అందరికీ తెలిసినది, ఏమిటంటే ఆ అప్పు అనే దానిలో చాలా భాగం తిరిగి స్విస్ బాంక్‌లు, తదితర చోట్లకి భద్రంగా చేరి పోయిందన్న విషయం. కానీ అది ఆ దేశాల పేర మాత్రం కాదు. ఈ సమస్యని అధ్యయనం చేసిన ఒక ఆర్థిక వేత్త అంచనా ప్రకారం స్విస్ బాంక్‌లలో నిల్వలు తృతీయ ప్రపంచ దేశాల అప్పులతో సమానంగా పెరుగుతున్నాయి. పాశ్చాత్య దేశాలలో ఎక్కువ మొత్తం అప్పు తీసుకున్న దేశాలు బ్రెజిల్, మెక్సికోలు. అందువల్లనే వాటి ఋణ భారం కూడా అత్యధికంగా ఉన్నది. అయినా బ్రెజిల్, మెక్సికోలకి చెందిన రాజకీయ నాయకుల నిల్వలు కూడా అంత ఎక్కువ మొత్తంలో నే ఉన్నట్లు చెప్ప బడుతున్నది.

మీరెప్పుడైనా జూరిచ్ వెళ్తే కొన్ని గంటల పాటు తీరిక చేసుకుని అక్కడి హోటళ్ళని సందర్శించండి. అక్కడ ఉన్న అతిథులలో ఎక్కువ మంది ఆసియా, ఆఫ్రికా దేశాల నించి వచ్చిన వారే ఉంటారు కానీ న్యూయార్క్, వాషింగ్‌టన్‌ల నుంచి కాదు అన్న విషయాన్ని మీరు గమనిస్తారు. మీరు వాళ్ళని మాటల్లోకి దించితే వాళ్ళు ఆయాదేశాల ప్రధాన మంత్రులు, అధ్యక్షుల బంధు వర్గంలోని వారేనని తెలుస్తుంది. వాళ్ళకి అక్కడ పని ఏమిటన్న ఆశ్చర్యం మీరు వెలిబుచ్చితే కేవలం పర్యాటకులుగా తాము అక్కడికి వచ్చినట్లు చెపుతారు వాళ్ళు. వాళ్ళు అక్కడ చేసేది మీ కర్చుతో, నా కర్చుతో మంచి కాలక్షేపం. వాళ్ళు కర్చు పెట్టే ఆ డబ్బు అంతా సంగ్రహించిన డబ్బే, జాతీయ కోశాగారాల నుంచి సంగ్రహించినది. దోపిడిదారు కాని తృతీయ ప్రపంచ దేశ నాయకుడు ఉండటం అరుదని చెప్పవచ్చు. ఫిలిప్పయిన్స్ మార్కోస్ అయినా, బంగ్లాదేశ్ ఎర్షాద్ అయినా, పాకిస్తాన్‌కి చెందిన భుట్టో అయినా సరే. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాలని గురించి వాళ్ళు పెద్ద కబుర్లు చెప్తారు కానీ వాషింగ్‌టన్‌లో కానీ, తదితర చోట్ల కానీ వాళ్ళ మాటలకి ఎవరూ విలువ ఇవ్వరు. ఎందుకంటే వాళ్ళేమిటన్నది అక్కడి అధికారులకి బాగా తెలుసు.

తటస్థ దేశాల సమావేశం వంటి సంస్థలు చెప్పుకోదగినదేమీ సాధించ లేక పోవటానికి కారణం ఇదే. అవి ఎంతో కాలంగా ఉన్నప్పటికీ వాటిని

(65 వ పేజీ చూడండి)

# కాలం మారిపోయింది

— గీతా సుబ్బారావ్















# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

3-9 అక్టోబరు 1986

శ్రీ అక్షయ నామ సం భాద్రపద బ అమావాస్య

సంపుటము 79 : సంచిక 5

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు 2-50

పోస్టులో 6నెలల చందా రు 71 50

పోస్టులో 12నెలల చందా రు 143 00

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

నటి భానుప్రియ

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :



# ఉత్తరాలు

## వినాయకచవితి ప్రత్యేక సంచిక

వినాయక చవితి ప్రత్యేక సంచిక మిద చిత్రకారుడు శ్రీ కాశీ గిసన వినాయకుని చిత్రం చూడ ముచ్చటగావుంది

ఇల్లిందల సరస్వతి దేవిగారి వెర్రితల్లి – కడుపు తీపి పూర్తి నవలిక, మధురాంతకం రాజారాం గారి బృందావనం కథ నటుడు రాళ్ళపల్లి గారి వినాయకుడి విచారం కధానిక చాలా బాగున్నాయి చూడ ముచ్చటగా ముస్తాబైన యీ సంచికలో కార్టూన్లు మాత్రం ఏపాటి కూడా పాఠకుల్ని నవ్వించ లేనట్లుగా వున్నాయి

-ముప్పలి చంద్ర రాయగడ

★ ★ ★

5–11 సెప్టెంబరు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక– వినాయక చవితి ప్రత్యేక సంచిక మిది నృత్య గణపతి చాలా ఎట్రాక్టివ్‌గా ఉన్నది ముఖ్యంగా ప్రత్యేక సంచికలోని జోక్స్, కార్టూన్లు బావున్నాయి బృందావనం భోజనప్రియుడు ఇత్యాది కథలు చక్కగా ఉన్నాయి అలాగే కరిగిన శిల 'సంకెళ్ళెవరికి?', నిశ్శబ్ద సంగీతం మొదలైన సీరియల్స్ ఎప్పటిలా రసవత్తరంగా ఆసక్తికరంగా సాగిపోతున్నాయి

– కె శివరామిరెడ్డి సీతామహాలక్ష్మి నందివెలుగు

★ ★ ★

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి వెర్రితల్లి - కడుపుతీపి కథ చాలా బాగుంది వాస్తవానికి చాలా దగ్గరగా వుంది

– కొమరవోలు శైలజ, మోదుకూరు

★ ★ ★

పూర్తి నవలిక 'వెర్రితల్లి – కడుపుతీపి రచనా శైలి యెంతగానో ఆకట్టుకుంది తల్లికి చెప్పకుండ తను వివాహమాడినటువంటి పుత్రుడిని క్షమించే తల్లులు నూటికి ఏ ఒక్కరుంటారో?

– మాచెర్ల భిక్షపతి, మెదక్

వినాయకచవితి ప్రత్యేక సంచిక ఎంతో బావుంది ముఖ్యముగా ఇల్లిందల సరస్వతీదేవి గారి వెర్రితల్లి – కడుపుతీపి చదివి మీకు ఉత్తరం వ్రాయకుండా ఉండలేక పోతున్నాను చాలా బావుంది ప్రస్తుత వాస్తవిక సమాజానికి అద్దం పట్టేలా ఉంది

– మాచర్ల వెంకటేశ్వర గౌడ్, మహబూబ్‌నగర్

★ ★ ★

5–11 సెప్టెంబర్ నెలలో విడుదలైన వినాయక చవితి ప్రత్యేక ఆంధ్రపత్రిక వినాయకుని ముఖచిత్రంతో ఆహ్లాదకరంగా అందుకున్నాం సిక్రెట్ ఏజంట్ విక్రమ్ మరల ఈ ప్రత్యేక సంచికతో ప్రారంభించడం మాకు చాలా ఆనందంగా ఉంది

– దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ

★ ★ ★

వినాయక చవితి ప్రత్యేక సంచిక ఆంధ్రసచిత్ర వారపత్రిక కే వన్నె తెచ్చినది జీవితం చేజారిందా?' సీరియల్ చాలా బావుంది ఈ సీరియల్ ముగింపు చాలా ఆసక్తికరంగా ఉంది

– పి శ్రీపతి, సునీత, మహబూబాబాద్

★ ★ ★

5–11 సెప్టెంబర్ 86 నృత్య గణపతి ముఖ చిత్రంతో వెలువడిన వినాయకచవితి ప్రత్యేక సంచిక, ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా బాగున్నది బొమ్మల సీరియల్ చూసినంత సేపు, సినిమా చూసినట్లనిపించినది

– గంటం మాధవి, కేశు, నాగరాజు, ఉప్పులూరు

★ ★ ★

జీవితం చేజారిందా సీరియల్ చాలా ఇంట్రస్టుగా వుంటున్నది వినాయక చవితి సంచికలో ముగింపు చదివితే అప్పుడే అయిపోయిందే అన్పించింది రచయిత్రి కాకాని కమలగారికి అభినందనలు

– గంగరాజు సుబ్బలక్ష్మి, ఒంగోలు

★ ★ ★

5–11 సెప్టెంబర్ 1986 నృత్య గణపతి ముఖ చిత్రంతో వెలువడిన వినాయక చవితి ప్రత్యేక సంచిక, ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారి పూర్తి నవలిక వెర్రితల్లి – కడుపుతీపి చాలా బాగున్నది బొమ్మల సీరియల్ చాలా ఆకర్షణీయంగాయున్నది

– చోడాబత్తుల శ్రీనివాసన్, విశ్వనాథన్, మాధవి, కుప్పనపూడి □

సీరియల్

# కరిగిన శిల




(గత సంచిక తరువాయి)

సరయుకి ప్రభాకర్ నర్సింగ్‌హోమ్‌నుంచి పిలుపొచ్చింది జాయినవమంటూ

ఇల్లు అమ్మి, అమ్మగా వచ్చినడబ్బుని ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసి ఆ వూరెళ్లి వుద్యోగంలో జాయినైపోయింది సరయు

వెళ్లగానే శ్యామల, ప్రభాకర్ ఆమెని చక్కగా రిసీవ్ చేసుకున్నారు ఆమె చెయ్యాల్సిన పన్లు చెప్పి స్టాఫ్‌నంతా పరిచయం చేశారు

శ్యామల ఎంతో గర్విష్టిగా వూహించుకున్న సరయు ఆమె ప్రవర్తన చూసి చాలా సంతోషించింది

పూల మూలంగా పూలు గుచ్చిన దారానిక్కూడా సువాసనలబ్బినట్టు డాక్టర్‌గారి మంచితనం ఈవిడక్కూడా అబ్బింది!" అనుకుంది

శ్యామల బలవంతంతో వాళ్ల ఔట్ హవుస్‌లోని రెండు గదుల్లో సరయు జీవితం సాఫీగా సాగిపోతోంది

ఆమెకిప్పుడు ఒంటరితనం అస్సల్లేదు గతాన్ని మర్చిపోవడానికి ఆమె చాలాసేపు హాస్పిటల్లోనే గడుపుతోంది.

అనేక రకాల పేషెంట్స్ అనేక ప్రదేశాల్నుంచి వస్తూంటే వారి మంచి చెడ్డలు కనుక్కుంటూండేది వారి అలవాట్లు మాట తీరూ ఆమెకి చిత్రంగా వుండేవి

ఆమె వచ్చిన కొత్తలో తరచూ వచ్చే పేషెంట్ ఒకామె డాక్టర్ దగ్గరికెళ్తూ వరండాలో కనిపించిన సరయుని ఆప్యాయంగా పలకరించింది

ఏం పున్నమ్మా! బావున్నావా?" సరయు కూడా నవ్వుతూ అంది

ఆఁ! ఏం బాగులే తల్లీ! ఓ రోజు లెగిస్తే ఓ రోజు లెగను మూడు దినాల్నుంచి ఒకటే తల తిరుగుడు ఆయాసం!" ఆయాసపడుతూ అందామె

మరి మూడు రోజుల్నుంచి సుస్తీగా వుంటే ఇప్పుడా రావటం?' చనువుగా మందలించింది సరయు

అయ్యో! మొన్నే వద్దావఁనుకున్నానమ్మా! కానీ - మొన్న రేత్రి మా సినబాబు సచ్చిపోనాడు అందామె

**జరిగిన కథ-14:** తన ఆఫీసు గురించి పేపర్లో పడిన వార్త విని కంపించిపోయింది సరయు. తన ఆఫీసు గొడవల్లో వేణుమాధవ్‌కి సంబంధం ఉందని, అతన్ని అరెస్టు చేశారని వనజ చెప్పగా నిర్ఘాంతపోయింది. వనజ దంపతులు సరయుకి ధైర్యం చెప్పి వెళ్తారు కేసు విచారణ పూర్తయింది రమణ ఒక సి ఐ డి ఆఫీసర్ అని తెలుసుకున్న సరయు నిర్ఘాంత పోయింది. త్వరపడి ఎలాంటి నిర్ణయాలు తీసుకోవద్దని సరయుకి ఉత్తరం రాసి తను దూర ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్ చెయించుకొని వెళ్లిపోతాడు రమణ డా ప్రభాకర్, డా మోహన్‌రావు జరిపిన ఇంటర్వ్యూకి వెళ్తుంది సరయు సరయు రాసిన ఉత్తరం పదే పదే గుర్తొచ్చి రమణ మనసుని అల్లకల్లోలం చేసేస్తోంది

'ఏవిఁటీ! మీ చిన్నబాబా? తుళ్లిపడింది సరయు

అవునమ్మా! మా సినబాబే! మొన్న రేత్రి పదో గంటకల్లా పేణం వదిలేసినాడు! అందామె తాపీగా-

"అయ్యో! పాపం! ఏవిఁటి సుస్తీ?' జాలిగా అడిగింది సరయు

"ఆఁ ఏదో వోతం కమ్మినాది!"

"నీకెందరు పిల్లలు?

"ఇద్దరాడ బిడ్లు, ఇద్దరు మొగోల్లు! ఏమ్మా? - ఎందుకు?

'అదే పాపం! మీ చిన్నబాబు ఓదార్చబోయింది సరయు

ఏం చేస్తానఁమ్మా! ఆడికీ బూమ్మీద నూకలు సెల్లిపోనాయి! నిర్విచారంగా అంటున్న ఆమె మనస్తత్వానికి బిత్తర పోయింది సరయు

కానీ సరయు యింకేదో అనబోతుంటే, వాళ్లిద్దరి సంభాషణ వింటూ ముసి ముసిగా నవ్వుకుంటున్న ప్రభాకర్, శ్యామల సరయు నోట్నుంచి ఇంక ఎలాంటి మాటలొస్తాయో అని కంగారుగా రంగంలోకి వచ్చేశారు

ఆఁ అవును సరయూ! పాపం! వీళ్ల చినబాబు అదే వీళ్ల చిన్నాన్న చాలా మంచివాడు! ఫోయాట్ట! ఎనభై ఏళ్లుంటాయనుకో . అంటూ ఆమెకర్థం అయేలా సైగచేసింది శ్యామల

వాళ్ల భాషకి చచ్చే నవ్వొచ్చింది సరయుకి

అలా రకరకాల మనుషుల్ని వారి మాటల్ని, ప్రవర్తల్ని అర్థం చేసుకుంటూ అచిరకాలంలోనే అందరికీ ఆప్తురాలయింది

* * * * * *

ఒంటరితనానికి రోసిపోయిన రమణ తిరిగి తన వూరికి దగ్గరగా వచ్చేశాడు ఎవరెన్ని విధాల చెప్పినా పెళ్లి మాత్రం చేసుకోలేదు

రాజమ్మ కాలంచేసి కూడా సంవత్సరం దాటిపోయింది ఆవిడ పోయాక మరీ పిచ్చెక్కినట్టుందతనికి ఓ రోజు ఆగలేక సరయు ఇంటికోసి వెళ్లాడు మనసులో ఆమె వుండదని తెలిసినా

అయితే సరయు వాళ్లిల్లు వుండే చోట ఓ పెద్ద భవంతి దర్శనం ఇచ్చింది

ఆ ఇంటివార్ని సరయుని గురించి అడిగాడు వాళ్లు సరైన జవాబు చెప్పలేకపోయారు సరయు అక్కడ లేదని తెలిసిన దగ్గర్నుంచీ ఆమెని చూడాలన్న ఆశ ఎక్కువయింది రమణకి అందుకే ఆశగా వనజ ఇంటికెళ్లాడు, ఆమెకి తప్పకుండా సరయు సంగతి తెలుస్తుందని

ఎవరు కావాలండీ?" అతన్ని గుర్తించని వనజ అడిగింది.

"సరయు కావాలండీ". పేలవంగా నవ్వాడు రమణ

'ఏవిఁటీ?" తుళ్లిపడింది వనజ

"సరయు యడ్రస్‌కావాలి వనజగారూ!"

ఆమె అతని ముఖంలోకి పరిశీలనగా చూసింది

'మీరు నన్ను గుర్తించలేదు నాపేరు రమణ!" అన్నాడు రమణ

రమణగారు! ఆశ్చర్యంతో కొయ్యబారిపోయింది వనజ అతన్ని లోపలికి ఆహ్వానించాలన్న విషయం కూడా మర్చిపోయింది

అవునండీ! రమణనే! పేలవంగా నవ్వాడతను

సారీ! అయామ్ వెరీ సారీ రమణగారూ! మిమ్మల్ని గుర్తుపట్టలేకపోయాను మీరు చాలా మారిపోయారు తేరుకున్న వనజ అతన్ని లోపలికి తీసుకొచ్చి కూర్చోపెట్టింది కాఫీ ఇచ్చి

ఇప్పుడు చెప్పండి! ఎలావున్నారు ఎక్కడుంటున్నారు? అంది వనువుగా

అతను చెప్పాడు

ఆమె బారంగా నిట్టూర్చింది

సరయు ఎక్కడుందో మీకు తెలుసా? ఆశగా అడిగాడు రమణ వనజ మాట్లాడలేదు

కులాసాగా వుందా? మళ్లీ అతనే అన్నాడు

ఆ!

పెళ్లిచేసుకుందా?

ఆ!

తృళ్లిపడ్డాడతను

ఎవర్ని?

తెలియదు!

అంటే నుదురు చిట్లించాడు రమణ

పెళ్లిచేసుకుందని మాత్రం విన్నాను మిగతా వివరాలు నాకూ తెలియవు

అంటే మీకు చెప్పకుండానే మీతో సంప్రదించకుండానే మిమ్మల్ని ఎలవకుండానే పెళ్లిచేసుకుందా? ఆశ్చర్యంగా అన్నాడు రమణ

అవును! అదిప్పుడు మునుపటి సరయు కాదు! అది చాలా మారిపోయింది ఇప్పుడావిడగారికి ఎవరి సహాయం అక్కర్లేదు! ఆమె గొంతులో రవంత నిష్ఠూరం ధ్వనించింది

నిజం! సరయు చాలా మొండి మనిషి! ఎంతసేపు తన దోరణి తనదేగానీ ఎదుటివార్ని అర్థం చేసుకోవడానికి కాస్తయినా ప్రయత్నించదు నిరాశగా అన్నాడు రమణ

వనజ మాట్లాడలేదు

మీకు సరయు యడ్రస్ ఆశగా చూశాడతను

సారీ తెలియదు!

ఇట్సాల్ రైట్!ఇంక నేనొస్తాను! రెండు చేతులు జోడించి లేచాడు రమణ

కూర్చోండికాసేపు! మీ గురించిన వివరాలు చెప్పనేలేదు కుతూహలంగా అంది వనజ

నా గురించి చెప్పుకొనేందుకేం వున్నాయి మొహమాటంగా అన్నాడతను

మీరు పెళ్లిచేసుకున్నారా?

ఓసారి ఆమె ముఖానికేసి పరిశీలనగా చూసి





బాపూజీ　　　　　　　　　　　　చిత్రం : దేవు దీక్షితులు

# మహాత్మా!

సత్యమే నీ ఆత్మగ
ధర్మమే నీ ఊపిరిగ
అహింసయె ఆయుధముగ
మనుగడ సాగించిన మహాత్మా!
కడలి కన్న మిన్న నీ ఆత్మ!!
రామరాజ్యము కావాలని
నాడు నువు కలలు గన్నావు!
ప్రజారాజ్యములో రాబందుల్ని
నేడు కనులారా చూస్తున్నాము!
ఉన్నవాడు మరింత ఎదుగుతున్నాడు
లేనివాడు మరింత ఒదుగుతున్నాడు
ఎటు జూచినా భ్రాంతి
ఎటూ కనిపించదు శాంతి
కావాలి నీజయంతి విశ్వశాంతి!!

—ఎ. నాగవేణి

## కరిగిన శిల

"లేదు" అన్నాడు రమణ.

"ఏం?".

"ఒద్దులెండి! అవన్నీ తల్చుకుంటే మానుతున్న గాయం రేగుతుంది". అదోలా అన్నాడు రమణ.

భర్త వచ్చేదాకా ఆగమనీ, కనీసం భోజనమైనా చేసి వెళ్లమనీ బ్రతిమాలింది వనజ

రమణ అన్నింటినీ సున్నితంగా త్రోసిపుచ్చి వెళ్లిపోయాడు

సరయు పొరపాటు చేసింది' ఓసారి మనసులోనే అనుకుని భారంగా నిట్టూర్చింది వనజ

* * * * * *

సరయు అక్కడ బాగా సెటిలయిపోయింది ప్రభాకర్ దంపతులుకేకాక అతని తల్లిదండ్రులక్కూడా ఆమె ప్రవర్తన ఎంతగానో నచ్చింది అందుకే సరయు వాళ్లకి ఆత్మీయురాలైపోయింది అయితే ఓ ట్రైనీస్టుకి అంత ప్రాధాన్యత ఇవ్వడం హాస్పిటల్లో అంతకు ముందునించి పనిచేస్తున్న వాళ్లకి అంతగా నచ్చలేదు

ఒకటి రెండుసార్లు ధైర్యంచేసి సరయు గురించి శ్యామలకి చెడుగా చెప్పబోయి తిట్లు తిన్నారు కూడా

ఆ రోజు ఆపరేషన్ థియేటర్లో వుండగా శ్యామల తల్లికి సీరియస్‌గా వుందని రామారావు ఫోన్‌చేశాడు

శ్యామల కంగారుగా భర్తకేసి చూసింది

"శ్యామూ' ఇప్పుడు నువ్వెళ్లిపో' ఈ ఆపరేషన్స్ అవగానే నేనూ వస్తాను' అన్నాడు ప్రభాకర్ అందుకు మొదట్లో శ్యామల ఒప్పుకోలేదు ప్రభాకర్ ఎలాగో నచ్చచెప్పి పంపించాడు

ఆపరేషన్స్ అయ్యేసరికి సాయంత్రం నాలుగు దాటిపోయింది ఇంటికొచ్చి స్నానంచేసి డ్రెస్ చేసుకొని మావగారికి ఫోన్ చేశాడు ప్రభాకర్

హై బి పి వల్ల అన్ కాన్షస్ అయిపోయిందనీ, ఇప్పుడు కాస్త బానే వుందనీ అందర్నీ చూడాలనుకుంటోంది కాబట్టి వెంటనే రమ్మని చెప్పాడు రామారావు

తేలిగ్గా నిట్టూర్చాడు ప్రభాకర్

అతను బయల్దేరదామనుకుంటూండగానే సరయు వచ్చింది,

ఎలా వుంది ఆవిడకి? అంటూ

చెప్పాడతను

మీరెళ్లరూ?

ఇదిగో వెళ్తాను' అన్నాడతను

వెళ్లగానే కండిషన్ ఎలా వుందో చూసి ఫోన్ చెయ్యండి సర్' అంది సరయు.

'అలాగే అన్నట్టు తలూపాడతను

సరయు వెళ్లిపోయింది

* * * * * *

భర్తకోసం చూసి, చూసి విసిగిపోయిన శ్యామల ఇంటికి ఫోన్ చేసింది ఫోన్ వంటావిడ కాంతమ్మ తీసింది

'కాంతమ్మగారూ! ఆయన బయల్దేరారా? సూటిగా అడిగింది, శ్యామల

మీరా అమ్మా? అమ్మగారికెలా వుంది? ఆతృతగా అడిగింది కాంతమ్మ

'ఆయన బయల్దేరారా లేదా? ఆవిడ మాటకి జవాబు చెప్పకుండానే నొక్కి అడిగింది శ్యామల

'లేదమ్మా'

ఇంకా బయల్దేరలేదన్న మాట' ఓసారి ఆయన్ని పిలవండి' తీక్షణంగా వుంది శ్యామల గొంతు

బాబుగారు ఇంట్లో లేరమ్మా'

'ఇంట్లో లేరా? ఇంత పొద్దున్నే ఎక్కడికెళ్లారు? ఏవైనా యమర్జన్సీ కేసా?

పొద్దున్నే వెళ్లటంకాదు రాత్రి ఇంటికే రాలేదు

'ఇంటికి రాలేదా? అదేం?' ఆశ్చర్యపోయింది శ్యామల

'రాత్రంతా సరయమ్మ దగ్గరే వున్నారు' దిగులుగా అంది కాంతమ్మ

సరయు దగ్గరా?' అదిరిపడింది శ్యామల

'అవునమ్మా'

మరి రాత్రి భోజనం పొద్దున కాఫీ ఒణుకుతున్న గొంతుని అదుపులో పెట్టుకుంటూ అంది శ్యామల

సాహిత్యాభిమానులకు చక్కటి అవకాశం!

# భారతి

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్ట్‌తో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ <u>చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!</u>




- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - ✂ - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

చందాదారుని సంతకం

"కాఫీ, భోజనం కూడా అక్కడికే పంపమన్నారమ్మా! ఇంతకీ అమ్మగారికెలా వుందమ్మా" మళ్ళీ అడిగింది కాంతమ్మ

ఆ మాటలేవీ శ్యామలకి వినిపించడంలేదు. 'రాత్రంతా సరయమ్మ దగ్గరే వున్నారు' అన్న కాంతమ్మ మాటలే చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి

"సరయు, ప్రభాకర్ రాత్రింబవళ్ళు ఒకే చోట వుంటూ, ఒకే చోట తింటూ .. ఒకే చోట ... ఓహ్! ఎంత ఘోరం!"

"అమ్మగారూ! .. బాబుగారొస్తే ఏం చెప్పను?" అన్న కాంతమ్మ మాటలకి పరధ్యానంగా వున్న శ్యామల త్రుళ్ళిపడి -

"ఏం చెప్పక్కర్లేదు!" అంటూ తక్కున ఫోన్ పెట్టేసింది ఆమె మనసంతా చేదు తిన్నట్టు అయిపోయింది

"అంటే తను ప్రాణాధికంగా ప్రేమించే ప్రభాకర్ కూడా అందరిలాంటి మగాడే!అందమైన ఆడది కనిపిస్తే ఒళ్ళు మరిచే అతి సామాన్యమైన మగాడు! అతనిలో ఎలాంటి ప్రత్యేకతా లేదు. తన భర్త శ్రీరామచంద్రుడిగా వూహించుకున్న తన అంచనా తప్పు! తనుకాక అతనికి మరో స్త్రీతో .. ఓహ్! భరించలేను!" మోకాళ్ళలో తల దాచుకుని పసిపిల్లలా బావురుమంది శ్యామల

* * * * * *

"అయ్యగారూ! అమ్మగారు ఫోన్ చేశారు!" అంది కాంతమ్మ ప్రభాకర్ ఇంటి! రాగానే.

"శ్యామల ఫోన్ చేసిందా? . వాళ్ళమ్మగారికెలా వుందిట?" ఆత్రుతగా అడిగాడు ప్రభాకర్.

"అదేమో బాబూ! ఆ సంగతి రెండు మూడుసార్లడిగినా సరిగ్గా చెప్పలేదు ఎంతసేపూ మీరెందుకు రాలేదనే అడిగారు" అందావిడ

"అలాగా". ఏదో ఆలోచిస్తూ ..ఫోన్ దగ్గరికెళ్ళి మావఁగారి నెంబర్ డయల్ చేశాడు ప్రభాకర్. ఫోన్ శ్యామలే తీసింది.

"ఎస్! డాక్టర్ శ్యామలా హియర్!" బొంగురుగా పలికిందామె గొంతు.

"హలో ! శ్యామూ! .. నేను! ప్రభుని!"

"ఓ!"

"అమ్మగారి కెలావుంది?" ఆతృతగా అడిగాడు ప్రభాకర్

"బానే వుంది!"

"థాంక్‌గాడ్! ఎలావుందా అని కంగారు పడుతున్నాను.. అవునూ. ఎన్నిసార్లు ఫోన్ చేసినా రెస్పాన్స్ లేదేవిఁటి? ఫోన్ అవుటఫ్ ఆర్డరా?"

"మీరు ఫోన్ చేశారా? ఎందుకు?" గంభీరంగా అడిగింది శ్యామల

"అమ్మగారి ఆరోగ్యం గురించి కనుక్కుందావఁనే! చాలాసార్లు ఫోన్ చేశాను.... రెస్పాన్స్ లేకపోతే చివరికి పోలీస్స్టేషన్‌కి చేసి కనుక్కుందామనుకున్నాను...."

"ఊఁ!"

"అదిసరే.... నేనెంత మాట్లాడినా నువ్వు మాట్లాడవేం?"

"మాట్లాడుతున్నాగా!" -

"అలాగా ... అవును, కాదు అంటూ పాపాయి మాటల్లా! .' నవ్వాడు ప్రభాకర్.

శ్యామల నవ్వలేదు.

"శ్యామూ!.... నీ గొంతు నార్మల్‌గా లేదు!"

"కోల్డ్ చేసింది!" క్లుప్తంగా అంది శ్యామల.

"సరే ... నేను బయల్దేరుతున్నాను " ఉత్సాహంగా అన్నాడు ప్రభాకర్

"ఎందుకు?"

అదేవిఁటి?" ఆశ్చర్యంగా అన్నాడు ప్రభాకర్.

"అదే. . అమ్మకి తగ్గి పోయిందిగా ..."

"ఓ! అదా . అలా కాదు .. ఆవిడని ఓసారి చూసినట్టూ వుంటుంది మనిద్దరం కలిసి వచ్చినట్టూ వుంటుంది " ఆప్యాయంగా అన్నాడు ప్రభాకర్.

"సరయు ఎలా వుంది?" హటాత్తుగా అడిగింది శ్యామల.

"సరయూనా?" బిత్తర పోయాడతను.

"ఆఁ! స . ర యు!" నొక్కి అందామె

"సరయు సంగతి నీకెలా తెలిసింది?"

'ఎలా తెలిస్తేనేం తెలిసింది!" ఆమె గొంతు అదోలా కంపించింది క్షణం అతనూ మాట్లాడలేదు

"చెప్పండి! సరయు ఎలా వుంది?"

"ఆవిడకేం పెళ్ళి కూతుర్లా వుంది!" సన్నగా నవ్వాడు ప్రభాకర్

"పెళ్ళికూతుర్లానా?"

"ఊఁ!.... నిజంగా షి యీజ్ వెరి లక్కీ!"

"ఎస్! షియీజ్ లక్కీ!" గొణిగింది శ్యామల.

"ఏవిఁటి శ్యామలా! కాస్త గట్టిగా మాట్లాడు!" ఆమె మాట అర్థంకాని ప్రభాకర్ గట్టిగా అన్నాడు

"మరేంలేదు సరయు విషయం నాకు తెలియకూడదని మీరెంత జాగ్రత్త పడ్డా తెలిసి పోయింది సారీ! షాగ్గా వుంది కదూ?" అంది శ్యామల

ఆమె గుండెల్లో అగ్ని రగులుతోంది

"ఛ! ఛ! . అదేంకాదు శ్యామూ!. . అన్నట్టు నువ్వు దొడ్లో ఆరేసి కాంతమ్మగార్ని తీసి దాచమన్నావు చూడు. . అదే. . మన మేరేజ్ యానివర్సరికి కొన్న చీర "

అతని మాట పూర్తి కానేలేదు–

"ఊఁ! చీర? .. ఏం చేశారు? . సరయుకి ప్రజెంట్ చేశారా?" అతన్ని నొప్పించాలని వ్యంగ్యంగా అంది శ్యామల.

'అరె! నీ కెలా తెలిసింది?" ఆశ్చర్య పోయాడతను.

"వ్వాట్?" అదిరిపడింది శ్యామల

ఆ చీర నిజంగానే సరయు కిచ్చాడనుకోలేదామె. వూర్కే దెప్పాలని మాత్రమే అలా అంది

'నిజమే శ్యామూ! అది సరయుకి ఇచ్చేశాను. . సారీ. . నీకా చీరంటే ఇష్టం కదూ?" నొచ్చుకున్నట్టు అన్నాడతను.

'ఇష్టమని తెలిసే ఇచ్చారుగా?" కఠినంగా అంది శ్యామల

"ఇదిగో శ్యామూ! నీకు నా మీద చాలా కోపంగా వుందని తెలుసు! కానీ.... కుదరకపోతే నేను మాత్రం ఏం చెయ్యను చప్పు!. .. ఏ మాత్రం వీలున్నా రాకుండా వుంటానా?" అనునయంగా అన్నాడు ప్రభాకర్.

"ఎలా వీలుంటుంది లెండి! మీ కెన్ని వ్యాపకాలు!"

ఆమె కోపానికి నవ్వొచ్చింది ప్రభాకర్‌కి.

"ఇదిగో! మై డియర్ శ్యామలాదేవీ! ఇప్పటికే మన ఫోన్ బిల్ చాలా అయిపోయుంటుంది తెలుగు సినిమాలో హీరో హీరోయిన్లలా చాలా విషయాలు మాట్లాడేసుకున్నాం నాకైతే ఓ డ్యూయట్ కూడా పాడాలనుంది. కానీ రేపు దానికవబోయే ఫోన్ బిల్ గుర్తొచ్చి ఆ పాట కాస్తా నోటిలోనే ఆగి పోయింది మీ నాన్నగారిలా నేనూ ఓ పెద్ద పోలీసాఫీసర్నయినా కాదు. ఫోన్ బిల్ మొత్తం నేనే కట్టుకోవాలి కాబట్టి డియర్!.... త్వరలో నీ దగ్గరి కొచ్చి వాలబోతున్నాను అప్పుడు నువ్వెన్ని ప్రశ్నలు వేసినా ఓపిగ్గా జవాబులు చెప్తాను. ఓ! కె!? బై" అంటూ ఫోన్ పెట్టేశాడు

* * * *

రమణ ఇప్పుడిప్పుడే చిన్నా తలపులనించి బైటపడి మామూలు ప్రపంచంలోకి వస్తున్నాడు

చిన్నా పేరిట ఓ అనాధాశ్రమం స్థాపించి వుద్యోగరీత్యా తానెక్కడున్నా శరణాలయాన్ని సవ్యంగా నడపడానికి ఓ కమిటీని ఏర్పాటు చేశాడు. తరచూ వెళ్ళి చూసొస్తూంటాడు చిన్నా శాంతిహోమ్" అని పేరు పెట్టాడు. అదలావుండగా. ఒక్కసారి సరయుని చూడాలన్న అతని కోరిక కోరికగానే వుండి పోయింది అతని కళ్ళు ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ఆమె కోసం వెతుకుతూనే వుంటాయి

"జీవితంలో ఒక్కసారి సరయుని కలవాలి! తన మనసులోని ఆరాటాన్ని, ఆవేదనని ఆమెకి చెప్పుకోవాలి. అప్పుడైనా తను ఆమెని గురించి ఆలోచించడం మానగలడేమో!

కానీ . సరయు .. ఇప్పుడు ఓ ఇల్లాలు!

భర్తతో హాయిగా కాపురం చేసుకుంటున్న ఆమెకి ఇప్పుడు తన రాక ఆనందాన్నిస్తుందా?. . మనసు విప్పి మాట్లాడుతుందా? ఒకవేళ ఆమె మాట్లాడినా ఆమె భర్త మాట్లాడనిస్తాడా?

లేనిపోని అపోహలు వారి మధ్య తలెత్తవు కదా! పాల కుండలాంటి ఆమె వైవాహిక జీవితంలో తానో విషబిందువు కాడు కదా!" ఇలా సాగుతూండేవి రమణ ఆలోచనలు

అయినా జీవితంలో ఒక్క సారైనా ఆమెని చూడాలి తనని గురించి ఆమె అపార్థం చేసుకుందని చెప్పాలి"! అన్న కోరికని మాత్రం అతను దూరం చేసుకోలేక పోతున్నాడు

అనాధ శరణాలయ స్థాపన సందర్భంలో అతనికి డాక్టర్ సుగుణతో పరిచయం అయింది

సుగుణది ఓ విషాదగాథ

సాటి డాక్టరైన హరిని ప్రాణ ప్రదంగా ప్రేమించింది పెళ్ళి చేసుకోవాలనుకుంటుండగానే అతనో ప్రమాదంలో చనిపోయాడు ఆమె కృంగి పోయింది చాలా రోజులు తిండీ, నిద్రా లేకుండా పిచ్చిదానిలా ఏడ్చింది ఆపై తనని తను ఓదార్చుకుంది ఓ దృఢ నిశ్చయాని కొచ్చి హరికి ఇష్టమైన అనాధ సేవ ప్రారంభించింది

అప్పుడే రమణ స్థాపించిన అనాధ శరణాలయం సంగతి విని తనని తాను పరిచయం చేసుకుని అక్కడి పిల్లలకి వుచిత వైద్యం చేస్తానని కోరింది రమణ ఆనందంగా అంగీకరించాడు

అప్పట్నుంచీ ఆమె చిన్నా శాంతిహోమ్‌లో రెగ్యులర్‌గా పని చేస్తోంది

లక్షలకి వారసురాలై వుండి కూడా ఎంతో నిరాడంబరంగా వుండేది తరచు అక్కడి పిల్లలకి స్వీట్స్ పంచేది. వారిలో కలిసి పోయి కబుర్లు చెప్పేది

ఆనందాన్ని అందరికీ పంచు ఆవేదనని నీ లోనే వుంచు అన్నట్టు బడబాగ్ని లాంటి తన బాధని కడుపులో నే దాచుకుని సదా చిరునవ్వులు చిందిస్తూ, ఎంతో మందికి, ఎన్నో విధాల ఓ దార్పు మాటలు చెపూ్త కాలం గడిపేస్తోంది

విషయం తెలియని వారు ఆమెలో ఇంత హాలాహలం దాగుందని పొరపాట్నయినా అనుకోలేదు అందుకే ఏంతో మంది యువకులు ఆమె అందచందాలని, తెలివి తేటల్ని, ఆస్తి పాస్తుల్ని, ముఖ్యంగా ఆమె మంచి మనసుని స్వంతం చేసుకోవాలని ప్రయత్నించి ఓడి పోయారు

అలాంటి సుగుణ రమణకి చేరువయింది అంతులేని ఆత్మీయతని అందించింది ప్రాణస్నేహితురాలైంది

తోచనప్పుడు ఆవిడ దగ్గరి కెళ్ళి కూర్చునే వాడు రమణ ఇద్దరూ మనసులు విప్పి మాట్లాడుకునే వారు

రమణ జీవితంలో జరిగిన ట్రాజడీలన్నీ విని అతన్ని వూరడించేది సుగుణ

అన్నీ చెప్పినా సరయు గురించి మాత్రం పూర్తిగా చెప్ప లేదు రమణ అయినా ఆమెకి రమణ సరయుని ప్రేమించాడేమో అని అనుమానం

ఓ రోజు అడిగేసింది

"సరయుని మీరు ప్రేమించారా ? అని. అతను మాట్లాడలేదు

మౌనంగా వుండి పోయాడు

ఆమెకి అర్థం అయింది ఇంక రెట్టించలేదు కానీ మాటవరస కన్నట్టు-

'రమణా' అనుకున్నవన్నీ జరగాలని లేదు జరిగేవి అనుకోవాలనీ లేదు ఏదైనాసరే మన ప్రయత్నం మనం చెయ్యడం, ఫలితం ఆ భగవంతుడికి వదిలెయ్యడం. నిజానికి అనుకున్న వన్నీ జరిగితే మనం మానవులం ఎందుకవుతాం ? అంది

అలాగే సరయు మాట వచ్చినప్పుడల్లా అతని మొహంలో ముసురుకున్న నీలి నీడలు చాలా సార్లే చూసింది. అందుకే తమ సంభాషణలో సాధ్య మైనంత వరకు సరయు విషయం రానిచ్చేది కాదు

రమణ మాత్రం రోజుకొక సారైనా-

"నేను సరయుని ఇంతగా ప్రేమిస్తున్నానా? అని తననితానే ప్రశ్నించుకునేవాడు

మళ్ళీ తన ఆలోచనలకి తనే తిట్టుకునే వాడు (ఇంకాఉంది)

# ధర్మో రక్షతి రక్షితః

గోవిందరాజు రామకృష్ణారావు

"ఎస్సై వున్నాడా?" ఫోన్లో అవతల పక్క కంచు మోగింది

హెడ్డు బిత్తర పోయాడు. మహా మహా వాళ్ళే చంద్రంపూడి పోలీసుస్టేషనంటే ఒకటికి రెండుసార్లు ఆలోచించుకుని మాట్లాడతారు మామూలు కానిస్టేబులికి కూడా 'గారు" తగిలించాలి అది రివాజు

అలాంటప్పుడు ఏకంగా ఎస్సైనే వున్నాడా' అనగల మొనగాడెవడబ్బా అనుకున్నాడు హెడ్డు

ఇంద్ర బవనం రామచంద్రయ్య తప్ప మరో శాల్తీ తట్టడం లేదు "ఆయనెందుకు చేస్తాడు?" హెడ్డు ఆలోచన్లోపడి వెంటనే జవాబివ్వ లేదు

ఎవరెక్కడ వినపట్లేదా?" కంఠం కసురుకుంది

రామచంద్రయ్య కంఠం గుర్తు పట్టి హెడ్డు ఖంగు తిన్నాడు

సార్సార్ నమస్కారం సార్ నేను సార్ హెడ్డుని సార్!

ఎస్సై యేమయ్యాడు?' తీవ్రంగా వచ్చింది ప్రశ్న అటు వైపు నుంచి

ఈ పొద్దున వూరెళ్ళారు సార్ సాయంత్రానికి వచ్చేస్తా మన్నారు వచ్చే టైమయింది సార్" హెడ్డు వినయంగా సంజాయిషీ చెప్పుకున్నాడు

ఈ వూరొచ్చి పట్టుమని పది రోజులు కాలేదు అప్పుడే చెక్కేశాడా. ఎక్కడికి?' కోపం, డబాయింపు కలిశాయి

వాళ్ళ నాన్నగారికి సుస్తీగా వుందని కబురొచ్చింది సార్ ఒక్కరే వెళ్ళారు సార్ వచ్చే టైమయింది సార్

సర్లే ఉన్నపళంగా ఒక కానిస్టేబుల్ని తీసుకునిరా!'

ఆజ్ఞాపించింది ఇంద్రభవనం ఫోను

ఏమయింది సార్?" హెడ్డు గాబరాగా అడిగాడు

ఏఁ, తల తిరుగుతుందా ? ఫోన్లోనే చెప్పాలా? వచ్చెయ్!

ఫోన్ అరిచి టక్కుమని వూరుకుంది

హెడ్డు నాలిక్కరుచు కున్నాడు డ్రస్సూ టోపి సర్దుకున్నాడు లాఠి పట్టుకుని మీసాలు సరి చేసుకున్నాడు టూ నాట్ టుని వెంట పెట్టుకుని హుటాహుటిగా ఇంద్రభవనం చేరుకున్నాడు

రామచంద్రయ్య అసలు యింటి పేరు తెలిసిన వాళ్ళు చాలా తక్కువ ఆయన వుండే ఇల్లు ఇంద్రబవనంలా వుంటుందని అందరూ అలా పిలుస్తారు

గేటు దాటి లోపలికి వెళ్ళారు తోరణాలు కట్టి వున్నాయి ఏదో విశేషం వుందను కున్నారు అలాంటి సందర్భాల్లో పిలిచి భోజనమో ఫలహారమో పెట్టడం అనవాయితీ కాని యీసారి పిలుపు అలా లేదు విందుకైతే కరిచినట్లు మాట్లాడే అవసరం ఏముంటుంది హెడ్డుకి అయోమయంగా వుంది

హాల్లోకి వెళ్ళారు. సోఫాలో రామచంద్రయ్య కాలుమీద కాలేసుకుని కూర్చున్నాడు చూపులు గంభీరంగా వున్నాయి పక్కనే వున్న బల్లమీద పూలదండ లున్నాయి గులాబీల వాసన హాలంతా గుప్పు మంటోంది ఎవరో వచ్చి సన్మానం లాంటిది చేసి వుండాలి కాని మనిషి అలా లేడే!– అనిపించింది హెడ్డుకి

కానిస్టేబుల్ టూనాట్టూతో పాటు హెడ్డు సోఫా దగ్గరి కెళ్ళాడు

గామచంద్రయ్య చురచుర చూశాడు.

లాఠి ఎడం చేత్తో నిరారుగా వుంచి టక్కుమంటూ కాళ్ళు దగ్గరికి చేరుస్తూ సాల్యూట్ వేశారు

అయినా రామచంద్రయ్య ముఖం ప్రసన్నంగా మారలేదు ఏదో గొడవుందని హెడ్డు పసి కట్టాడు.

'ఎస్సైగారు వచ్చే టైమయింది సార్ స్టేషన్లో చెప్పొచ్చాను రాగానే తమ దగ్గరి కొచ్చేయమని–' విన్నవించుకున్నాడు

ఒక్క క్షణం హాలంతా నిశ్శబ్దం ఆవరించింది.

'ఇవతల కొంప మునిగింది ఆయనొచ్చే దాకా వ్యవహారం ఆపమంటావా?' హాలు దద్దరిల్లింది

హెడ్డుకి ఏం అడగాలో ఎలా అడగాలో పాలు పోలేదు

అయ్యగారి మాటలు విని పెద్ద పాలేరు పరుగెత్తు కొచ్చాడక్కడికి

రామచంద్రయ్య అతని వంక చూశాడు సంగతి హెడ్డుకి చెప్పమంటున్నాడని గ్రహించాడు

'అది కాదండి ఇవ్వాళ అమ్మాయిగారి పుట్టిన రోజండి తనతో పాటు ఆరో తరగతి చదువుతున్న కొందరు ఆడపిల్లల్ని కూడా పిలిచారండి. చుట్టాలు పక్కాలు వున్నారనుకోండి వాళ్ళూ వచ్చారు '

'అసలు సంగతి ఏడు సోది చెప్పక' రామచంద్రయ్య కసురుమన్నాడు

పెద్ద పాలేరు బిక్కచచ్చి 'అలాగేనండి అది కాదండి – మొత్తం ఆరుగురు పిల్లలొచ్చారండి పూలదండ వేశారండి పెన్నులో ఎందో ఇచ్చారండి అమ్మాయిగారి మెళ్ళో సన్న గొలుసు పొడుగాటిది ఉన్నట్టుండి కనిపించడం లేదండి. ఈ పిల్లలు వచ్చాకే పోయిందండి. వీళ్ళొచ్చినప్పుడు వేరేవాళ్ళెవరూ ఇటు రాలేదండి ' గడగడా సంగతి చెప్పేశాడు

హెడ్డు పై జేబులోంచి చిన్నపుస్తకం బాల్‌పెన్ను తీయబోయాడు

'కేసు రాసుకుంటావా?' అందుకున్నాడు పిలిచిందన్నట్లుగా వుంది ఆ ప్రశ్న ధోరణి

హెడ్డుకి ఏం చేయాలో తోచలేదు ఏమడిగితే ఏం తప్పో అని నీళ్ళు నములుతున్నాడు

పెద్దపాలేరు వంక చూస్తూ 'ఆ పిల్లలంతా వెళ్ళిపోయారా?' అడిగాడు

'ఇద్దరెళ్ళిపోయారు '

'ఈ వూరేనా వాళ్ళది?'

'కాదు పక్కన ఏ వూరో తెలియదట '

హెడ్డు రామచంద్రయ్య వైపు అతివినయంగా చూస్తూ 'అమ్మాయిగారు లోపల వున్నారాండి?' నూతిలోంచి మాట్లాడుతున్నట్లు అడిగాడు

రామచంద్రయ్య చర్రున లేచి నిలబడి 'ఏఁ అమ్మాయిని ప్రశ్నలు వేస్తావా?' కళ్ళల్లోంచి నిప్పులు రాలాయి

'ఎంత మాట ఊరికే అడిగాను సార్ సంగతి నేను చూసుకుంటాగా 'సార్' తప్పయిపోయిందని చెబుతున్నట్లుగా వుంది

'మిగిలిన నలుగురు పిల్ల లెక్కడున్నారు?' పెద్ద పాలేరు నడిగాడు

'అదుగో ఆ పక్కన వడ్ల బస్తాలున్న కొట్లో పెట్టి బయట గొళ్ళెం వేశాం' అని చెప్పి రామచంద్రయ్య వంక చూశారు

'హెడ్డూ! నిన్ను పిలిపించింది ఈ చచ్చుప్రశ్నలు వేయడానికి కాదు అర్థవయిందా బొంబాయి నుంచి తెచ్చాను అమ్మాయికి కొత్త రకంగా వుంటుందని సన్నగా నాజుగ్గా వుంటుంది అమ్మాయికి నచ్చింది వెధవ డబ్బు గురించి కాదు పిల్లల్లో ఎవరో కొట్టేసి వుంటారు వాళ్ళ దగ్గరుందో కూడా బలుక్కుని వెళ్ళిపోయిన పిల్లల్తో పంపి చేశారో అర్థవయిందా?'

హెడ్డు తలూపాడు గత్యంతరం లేక ఏమి చేయాలో తోచలేదు రామచంద్రయ్య ఆంతర్యం గ్రహించాడు కాని ఆడపిల్లలు ఎవరి పిల్లలో లాఠీ ఝళిపించితే ఏం ప్రమాదమొస్తుందో వ్యవహారం తన మీదకే తిరిగితే ఎస్సై లేడాయె అసలే రోజులు బాగోలేదు సంగతి పైకి పొక్కితే లేనిపోని తంటా ఎంక్వయిరీ అన్నారంటే ముందు తన మీదే పిడుగు పడుతుంది సస్పెండు చేసి వూరుకుంటారు తర్వాత రామచంద్రయ్య పలుకుపడి వుపయోగించి తప్పిస్తారు అది వేరే సంగతి సర్వీసులో బ్లాక్ మార్కు వస్తుంది హెడ్డు మథనపడుతున్నాడు

హెడ్డు వెంటనే కొట్టు వైపుకి లాఠి వూపుకుంటూ వెళ్తాడని వ్యవహారం తేలిపోతుందని ఆశించాడు అలా జరగలేదు

'ఏం హెడ్డూ! ఐపిసి సెక్షన్లు గుర్తుకు

తెచ్చుకుంటున్నావా! లేకపోతే ఎవరింటి కొచ్చావో మర్చిపోయావా?' హెచ్చరించినట్టుగా వున్నాయి ఆ మాటలు

జంకు పట్టుకుంది హెడ్కుకి ఒక్కక్షణం ఆలోచించాడు ఒక నిర్ణయానికొచ్చాడు '

ఒకసారి మీసాలు తుడుచుకున్నాడు

'కొట్టు తెరు' పెద్దపాలేర్ని పురమాయించాడు తనూ వెంట వెళ్తూ

రామచంద్రయ్య అటు వైపు దర్పంతో చూశాడు తలుపు గొళ్ళెం తీసి పెద్దపాలేరు గుమ్మం దగ్గర నిలబడ్డాడు

లోపల్నుంచి ముందు సన్నని ఏడుపులు వినిపించాయి

లాఠీ నాలుగు సార్లు దభ్ దభ్ శబ్దం చేసింది ఏడుపులు పెద్దవయ్యాయి

ఆ ఏడుపుల్లో హెడ్డు అడిగిన ప్రశ్నలకి పిల్లలిచ్చిన జవాబులు ఇవతలికి వినిపించలేదు

పెద్దపాలేరు తలకాయ పక్కకు తిప్పుకుని నిలబడ్డాడు అతని కళ్ళలో తిరిగిన నీళ్ళు ఎవరికీ కనిపించలేదు.

హెడ్డు లాఠీ వూపుకుంటూ బయటికొచ్చి 'గొళ్ళెం పెట్టు' అని చిరాకుగా అన్నాడు లోపల ఏడుపులు ఆగలేదు గొళ్ళెంపెట్టి యివతలి కొచ్చాడు.

'సార్ పాపం పిల్లలు ఏమి తెలియదంటున్నార్ సార్. అంతకీ తగిలించా కూడా. చూస్తే చాలా అమాయకుల్లా వున్నారు ' మనవి చేసుకున్నాడు

'అంటే నీ వుద్దేశం గొలుసు పోలేదంటావ్ వాళ్ళెవరూ తీయలేదంటావ్ బయటికి చెరవేయలేదంటావ్?' కోపం మిన్నుముట్టింది

'అదికాదు సార్ అమ్మాయిగారు ఇంకెక్కడన్నా పెట్టారేమో ' నసిగాడు

'తెలితక్కువగా వాగకు ఈ హాల్లో వుండగానే గొలుసు పోయింది పాలేరు చెప్పింది వినలేదా?'

'సార్ మన్నించండి నేననేది '

ఇంతలో వాకిట్లో స్కూటర్ చప్పుడయితే అంతా బయటికి చూశారు

'ఎస్సైగారొస్తున్నార్లే వుంది సార్ ' హెడ్డు, టూనాట్ టు అవతలికి పరుగెత్తారు సాల్యూట్ చేశారు

ఎస్సై స్కూటర్‌కి స్టాండ్ వేశాడు ,

అక్కడే హెడ్డు సంగతి టూకీగా చెప్పాడు

లోపలికొచ్చారు.

ఎస్సై సాల్యూట్ చేశాడు రామచంద్రయ్య గంభీరంగా తల పంకించాడు

'హెడ్డ్ సంగతి చెప్పాడు తప్పకుండా తెలుసుకుంటాను సార్'

రామచంద్రయ్య ఏమి మాట్లాడలేదు

'మీ యిద్దరూ హాలంతా బాగా వెతకండి ఆదేశించాడు హాలు నాలుగు మూలలా పరిశీలనగా చూస్తూ

బల్లమీద పూలదండలు కనిపించాయి పిల్లలు పూలదండలు వేసిన సంగతి హెడ్డు చెప్పాడు గొలుసు ఎలా వుంటుందో వూహించుకున్నాడు

హెడ్డూ, టూనాట్‌టు జాగ్రత్తగా హాలులో నేలమీద వెతుకుతున్నారు

ఎస్సై బల్ల దగ్గరికెళ్ళాడు

రామచంద్రయ్య ఎస్సైని గమనిస్తున్నాడు



# గుప్తదానం

## ధర్మపథం




ధనం ఉన్నందుకు తాను అనుభవించడం, ఇతరులకు దానం చెయ్యడం ప్రధానాలు కొందరు ఉదారులు తాము అనుభవించడం కంటె ఇతరులకు ఇవ్వడమే ముఖ్యంగా భావిస్తారు అలాటి వాళ్ళు చాలా అరుదుగా ఉంటారు

దానం చెయ్యడంలో వివిధ పద్ధతులు కానవస్తాయి కొందరు పేరు ప్రతిష్ఠల కోసం దానం చేస్తారు. వారు కవులకూ, గ్రంధకర్తలకూ- తమకు పుస్తకాలు అంకితం చేయించుకొని, తమ్ము మిక్కిలి ప్రశంసించే పద్యాలతో కూడా తమ చాయా చిత్రాలను ప్రకటింపజేసుకుంటారు దీనివల్ల తమ పేరు శాశ్వతంగా నిలుస్తుందని వారి అభిప్రాయం ఇలా జరగడం పుష్కలంగా ధనం యిచ్చిన వారికే కొందరు గ్రంథముద్రణకు తృణమో పణమో సహాయం చేసి, తమ పేరు దాతల పద్దులో చేరేటట్లు చూచి తృప్తి పడతారు ఏమయినా సరే- వీరు ద్రవ్యదాతల కింద లెక్కకు వస్తారు

కొందరు దాతలకు ఇట్టి పద్ధతి నచ్చదు అయినా ప్రతిగ్రహీతల నిర్బంధం వల్ల సమ్మతించవలసి వస్తూ ఉంటుంది. కాని ఇట్టి ప్రచారానికి ఏమాత్రం యిష్టపడని కొందరు, ఎక్కువ ధనాన్ని దానం చేసినా, తమ పేరు ప్రకటించవద్దని గట్టిగా చెప్పియే దానం చేస్తారు ఇది యితరులకు తెలియదు ఇదే గుప్తదానం. ఇదే ఉత్తమ మైనది ఇట్టి దాతలను బట్టియే "ఒక చేతితో యిస్తే రెండో చేతికి కూడా తెలియని దానం" అనే ప్రసిద్ధి ఏర్పడింది

త్యాగ స్వభావం గల ఉత్తములు దానం చెయ్యడానికి సంసిద్ధంగా ఉన్నా, అట్టి దానం జరగకుండా చూడడానికి అసూయాపరులు సర్వత్రా ఉండనే ఉంటారు. దీనికొక చక్కని పోలిక ఉన్నది సమృద్ధిగా నీరుగల నుయ్యి నీరు ఇవ్వడానికి సిద్ధంగా ఉంది గృహిణి నీరు చేదుకొనుటకు – బొక్కెనకు కట్టిన త్రాడు గిలకమీద వేసి, ఆ బకెట్‌ను నూతిలోకి దింపి, నీరు నింపి బయటికి లాగుతూ ఉన్నప్పుడు, ఆ గిలక కిర్రు కిర్రుమని కఠోరంగా ధ్వని చేస్తుంది ఇచ్చేది యిస్తుండగా, పుచ్చుకొనేది పుచ్చుకుంటూ ఉండగా- మధ్య తన సొమ్మేమి పోయింది? ఇవ్వవద్దని అరవడం ఎందుకూ? ఈ పోలిక ఆ కుటిలమతులైన అసూయాపరులకు చక్కగా అమరి ఉంటుంది దాతల దగ్గర ఇలాంటివారు చేరి ఉండటం సహజం అందువల్ల ఉదారహృదయులైన దాతలు, చేసే దానం ఏదయినా, ఇతరులకు ఎరుక లేకుండా గుప్తంగా చెయ్యడమే మంచిది.

– ఖులుసు వేంకట రమణయ్య

# ధర్మో రక్షతి రక్షితః

పూలదండలు ఒక్కొక్కటీ తీసి ఎస్సై పరిశీలిస్తున్నాడు.

ఒక గులాబీదండకు సన్నని గొలుసు చిక్కుకుంది మెరుస్తుంది చెమ్కితో పాటు

ఆ దండను భద్రంగా రామ రామచంద్రయ్య దగ్గరికి తీసుకు వచ్చాడు

హెడ్డూ, టూ నాట్ టు కూడా అక్కడి కొచ్చారు

ఎస్సై ఆ సన్నని గొలుసు తీసి సోఫా ముందున్న టీపాయ్‌మీద పెడుతూ ఇదుగో సార్, గొలుసు- ఇదేనా?

రామచంద్రయ్య ముఖంలో చిరునవ్వు వచ్చి వెంటనే మాయమయింది తొట్రుపాటు అలముకొంది ముఖం వెల వెల పోయింది

థాంక్యూ గొంతు పొడిగా పలికింది

ఆ నలుగురు పిల్లల్ని బయటికి తీసుకురా ఎస్సై కటువుగా ఆదేశించాడు టూనాట్‌టుని

ఎస్సార్ అని గబగబా వెళ్ళాడు

పిల్లలు భయంతో గజగజలాడుతూ బావురుమన్నారు

మిమ్మల్నేం చేయను భయపడకండమ్మా ఎస్సై ఓదార్పుగా అన్నాడు, కొట్టు బయటికొస్తున్న పిల్లలతో

నలుగురూ బయటి కొచ్చారు అందులో ఒకమ్మాయి ఎస్సైని చూసి పరుగెత్తు కొచ్చి చుట్టేసుకుని బిగ్గరగా ఏడ్వసాగింది

ఊరుకో అమ్మా ఏం కాలేదు గొలుసు ఒక పూలదండకి చిక్కుకుంది ఇక్కడే వుంది అని అందరు పిల్లలికి తెలియాలని చెప్పాడు

పిల్లల మనసు కుదుట పడింది కాని భయం ఇంకా తగ్గలేదు

టూ నాట్ టూ! ఈ ముగ్గురు పిల్లల్ని జాగ్రత్తగా ఇళ్ళ దగ్గర దింపిరా నేను ఇప్పుడే వచ్చి వాళ్ళని కలుస్తానని చెప్పు స్వయంగా నేనే క్షమాపణ వేడుకుంటానని కూడా చెప్పు- తెలిసిందా! అన్నాడు హెడ్డు వైపు తిరిగి

మా అమ్మాయిని యింటి దగ్గర దిగబెట్టి వస్తాను నువ్వు స్టేషనికి వెళ్ళవయ్యా' అని పురమాయించి పిల్లలందరి తల నిమిరాడు బుజ్జగిస్తూ

హెడ్డు ముఖంలో నెత్తురు చుక్క లేదని పించింది తల వంచుకుని, నన్ను క్షమించండి సార్ అని కాళ్ళపైపడి ప్రాధేయ పడ్డాడు

హెడ్డును లేవదీస్తూ, జరిగి పోయిందేదో జరిగి పోయింది నువ్వేం చేస్తావ్ లోకం అలా తయారయింది అన్నాడు

రామచంద్రయ్య వైపు తిరిగి సాల్యూట్ చేసి ఆయన సమాధానం కోసం ఆగకుండా గబగబా వెళ్ళిపోయాడు కూతుర్ని తీసుకుని

పిల్లలు కళ్ళు తుడుచుకుంటూ టూ నాట్ టూ వెంట బయలు దేరారు హెడ్డు తలవంచుకుని హాలు దాటాడు

రామచంద్రయ్య, పెద్ద పాలేరూ రాతి బొమ్మల్లా నిలబడి పోయారు □

# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ **వెనుక** కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి కాపీ కార్టూన్‌లు పంపరాదు



# శాకాహారులే అదృష్టవంతులు!

శాకాహారులకు సరిపడా మాంసకృత్తులు లభ్యం కావనీ, అందువల్ల విటమిన్‌ల కొరత వల్ల వారు బాధపడే అవకాశం ఉందనీ, ఆ కొరత మూలంగా వారిలో రోగ నిరోధక శక్తి పడిపోగలదనీ మొదట్లో ఎంతో మంది భావించారు. అయితే ఇదంతా ఉట్టిదే అని తరువాతి పరిశోధనలు స్పష్టం చేసాయి. పయిగా మనిషి ఆయుర్దాయాన్ని పెంచగలిగేది రోగనిరోధక శక్తిని కాపాడేది శాకాహారమేనని రుజువు కూడా అయింది! గుండె జబ్బులు, రక్తపోటు వంటి వ్యాధులు, కాన్సర్ వంటి కొరుకుడు పడని రోగాలూ శాకాహారులకి చాల అరుదుగా కాని రావని పరిశీలనలు వెల్లడి చేస్తున్నాయి కూడా! ఇదంతా చూస్తూ ఉంటే మాంసాహారుల కన్నా శాకాహారులే ఎన్నో విధాలుగా అదృష్టవంతులని అనుకోవలసి వస్తుంది.

శాకాహారులు పప్పుదినుసులు, పంట ధాన్యాలు, ఆకు కూరలు, కూరగాయలు, పాలు, పెరుగు, మీగడ, నెయ్యి వగైరా పదార్థాలు భుజిస్తారు కాబట్టి వారు తీసుకొంటున్నది ఆహార నిపుణులకు అంగీకార యోగ్యమైన పుష్టికరమైన ఆహారమే అవుతుంది. గుడ్లను కూడా కొందరు శాకాహారంలోకే చేరుస్తారు. గుడ్లు తినడం ఆరోగ్యానికి మంచిదే కాని, గుడ్లు స్వీకరించకుండా కేవలం శాకాహారాన్ని మాత్రమే తీసుకున్నా కలిగే నష్టమేమీ ఉండదు పోతే మాంసాహారంలో లభ్యమయ్యే బి-12 విటమిన్ శాకాహారులకు అందక పోవచ్చు. దీనివల్ల నోటి పుండు ఏర్పడడం, పెదిమలు పగలడం వంటి చిన్న చిన్న జబ్బులు వస్తాయే తప్పనిస్తే ప్రాణాపాయకరమైన గండాంతరాలదగ్గ వ్యాధులు రావు. ఈ జబ్బులు కూడా విటమిన్‌లు సేవించగానే మటుమాయమై పోతాయి కాబట్టి శాకాహారం వల్ల కలుగుతున్న ఈ కొద్దిపాటి నష్టం కూడా పరిగణించ దగ్గదిగా కనిపించదు.

జంతు మాంసం అధికంగా తీసుకొనే వారికి జఠరకోశానికి సంబంధించిన కాన్సర్ రావడానికి ఎనభై శాతానికి పయిగా అవకాశ ముంటుందని బెర్లిన్‌లో ఉన్న "ఇన్స్టిట్యూట్ ఆఫ్ సోషల్ మెడిసన్ అండ్ ఎపిడి మియాలజీ" నిపుణులు చెబుతున్నారు. శాకాహారం వల్ల ఈ బెడద ఉండదు. పయిగా పీచు ఉన్న పదార్థాలు తినడం వల్ల ఈ కాన్సర్ రాకుండా రక్షణ కూడా ఏర్పడుతుంది. రక్తం శుద్ధి కూడా అవుతుంది. చిన్న ప్రేవులకు సంబంధించిన కాన్సర్ కూడా మాంసాహారులలోనే ఎక్కువగా వస్తుంది. భారీకాయులైన శాకాహారులకు ఈ కాన్సర్ చాల అరుదుగా సోకుతుంది. అది కూడా వారు తగినంత పుష్టికరమైన శాకాహారాన్ని స్వీకరించకుండా ఉంటేనే! ఇలాగే మెదడులో కణతలు కూడా మాంసాన్ని ఎక్కువగా తీసుకొనే వారికే ఏర్పడుతాయని కాలిఫోర్నియా శాస్త్రజ్ఞులు వెల్లడిస్తున్నారు. మాంసాహారానికి తోడు ధూమపానం, సురాపానం, మాదకద్రవ్య సేవనం మొదలైన దురభ్యాసాలు ఉంటే పరిస్థితి మరింత క్షీణించి ప్రాణాంతకం కావచ్చు!

గుండెకు సంబంధించిన రుగ్మతలకు మూల కారణంగా కొలెస్టరాల్ మోతాదు మిరడాన్ని గురించి వైద్య నిపుణులు తరచూ వెల్లడిస్తూ ఉండడం మనకు తెలిసిన విషయమే. జంతువుల క్రొవ్వు పదార్థాలను స్వీకరించడం వల్ల ఈ కొలెస్టరాల్ శాతం రక్తంలో బాగా ఎక్కువయ్యే అవకాశం ఉంది. ఈ కొలెస్టరాల్ మరి ఎక్కువైతే రక్తనాళాలలో కూరుకొని పోయి రక్త ప్రవాహానికి ఆటంకం కలిగించడమే కాకుండా, రక్తనాళాలు చిట్లి పోయేలా ఒత్తిడిని కలిగిస్తుంది. దీనివల్ల గుండెపోటు రావచ్చు. రక్తపీడనం విపరీత మైన హెచ్చు తగ్గులకు గురికావచ్చు. ఫలితంగా మరణం సంభవించవచ్చు. ఈ విపరీతాన్ని శాకాహారం స్వీకరించడం వల్ల దూరం చేసుకోవచ్చు. శాకాహారం వల్ల కూడా కొలెస్టరాల్ రక్తంలో చెరుకోవచ్చు కాని మోతాదు మీరే ప్రసక్తి ఎప్పుడో కాని తలెత్తదు. అది కూడా నెయ్యి, వెన్న, జున్ను, మీగడ- ఇత్యాది ఆహార పదార్థాలను మిక్కుటంగా సేవిస్తేనే తప్ప సాధారణ పరిస్థితుల్లో మోతాదు దాటే ప్రశ్నే ఉదయించదు. పశ్చిమ ఆస్ట్రేలియాకు చెందిన అయాన్ రోస్ అనే శాస్త్రవేత్త ఈ విషయంలో ఒక ఆశ్చర్యకరమైన అంశాన్ని వెల్లడించడం ఎంతో ఆలోచనను రేకెత్తిస్తుంది. శాకాహారం స్వీకరించడం వల్ల రక్తపోటు వచ్చే అవకాశం ఉండదని ఇంతవరకూ అనుకొన్నాము. కాని, శాకాహారాన్ని భుజించడం వల్ల రక్తపోటు ఉన్న వారికి కూడా తగ్గు ముఖం పడుతుందని అనుకోలేదు. అయాన్ రోస్ శాకాహారం రక్తపోటును నియంత్రిస్తుందని స్పష్టంగా ప్రకటిస్తున్నాడు. ఈ నియంత్రణ అనేక జీవరసాయనిక సంశ్లిష్ట చర్యల ఉమ్మడి ఫలితం అని మాత్రమే చెప్పగలుగు తున్నాడు కాని పూర్వాపరాల విశ్లేషణ ఇంకా పరిశోధనా స్థాయిలోనే ఉంది.

సిగరెట్‌లు, హాట్ డ్రింక్‌లు- వీటికి దూరంగా ఉన్న శాకాహారులు ఎక్కువ కాలం జీవించ గలుగు తున్నారు. పోతే టీ, కాఫీ, ఆల్కహాల్, పెథిడిన్ వంటి మత్తు మందులు వాడే శాకాహారులు హృదయ కోశానికి, శ్వాసకోశానికి సంబంధించిన వ్యాధులకు గురవు తున్నారు. ఈ గురి కావడమనే అంశం మాంసాహారులలో అధికం కాగా, సురాపానాది దురభ్యాసాలకు మరిగిన మాంసాహారులలో అయితే ఇక చెప్పవలసిన అవసరం లేదు. పొగత్రాగడం ఎలా ఆరోగ్యానికి హానికరమో సారాయి తీసుకోవడం ప్రాణానికి ఎంత నష్టమో మనకు బాగా తెలిసిన విషయాలు కాగా, మాంసాన్ని స్వీకరించడం ఎటువంటి నష్టాన్ని కలిగిస్తుందో అన్నది ఇంకా జనసామాన్యానికి తెలిసి రావడం లేదు. మాంసాహారాన్ని స్వీకరించకుండా మనుగడ సాగించగల దశలో మానవాళి ఉందని అనడం హాస్యాస్పద మవుతుంది. పోతే మాంసాహారాన్ని మితంగా తీసుకోవడం అలవాటు చేసుకోవడం మంచిది. అలాగే శాకాహారానికి కొరత లేకుండా అన్ని రకాల చర్యలూ చేపట్టడం మన విధి. మన మహర్షులు కందమూలాదులను భుజిస్తూ తమ ఆరోగ్యాన్ని ఎంత జాగ్రత్తగా కాపాడు కొన్నారో అన్న విషయం ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకోవడం సమయోచితంగా ఉంటుంది.

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

శాకాహార ప్రాముఖ్యాన్ని గురించి ప్రాయోగికంగా పృష్టపడు న్న సరికొత్త సస్య పంగడాలు'



# సీరియల్

# పావని



## సి. విమలాగణేశ్

(గత సంచిక తరువాయి)

స్కూలు నుంచి అప్పుడే యింటికి వచ్చింది పావని పిల్లల అల్లరి చూస్తుంటే నిజంగా పావనికి భయం పట్టుకుంది ఈ చిన్న పిల్లలకు చదువు చెప్పటం చాలా కష్టమని అతి స్వల్పకాలంలోనే పావని తెల్సుకుంది. నీరసంగా వచ్చి లోపలికి నడిచింది ఎదురుగా విశాలి

'జీతం యిచ్చారా?"

"లేదు పిన్నీ యింకా నాలుగు రోజులు పడుతుందట .

చావలేకపోయాడు పావని మారు మాట లేకుండా లోనికి నడిచింది

"పావనీ, ఉదయమనగా తడిపిన బట్టలన్నీ అలాగే వున్నాయి కాస్త వుతికి ఆరవేయి అధికారం ఉట్టిపడుతూంది.

అలాగే పిన్నీ!' యంత్రంలా లేచింది పని ముగించి వచ్చి కూచుంది మనసంతా ఆలోచనలమయం తన జీవితం యెలా తెల్లారుతుందో అర్థం కాకుండా వుంది విజయ్‌కి వుత్తరం రాసి పది రోజులయింది సమాధానం యింతవరకూ లేదు కారణం యేమిటి? ఎందుకు రాయలేదు? ఒకవేళ వచ్చిన వుత్తరాన్ని పిన్ని చింపేసిందా? యిక ఆలోచించలేకపోయింది విశాలి స్వభావం బాగా తెలుసు బగవాన్ నీవే దిక్కు కన్నుల్లో నీరు నిండింది మనసు బాదగా మూలిగింది అంతలో బయటినుంచి మాటలు వినిపించాయి

యేం కావాలి?' విశాలి కొత్త వ్యక్తి వంక అదోలా చూస్తూ అడిగింది

'పావని యిల్లు యిదేనా?

ఔను మీరెవరు? ఆమె మీకెలా తెలుసు?

ఇద్దరం కలిసి చదువుకున్నాం '

అయితే ఆమెతో మీకేం పని?' చిలదీసి అడిగింది అంతలో పావని బైటికొచ్చి యెదురుగా వున్న విజయ్‌ని చూచి -

విజయ్ నువ్వా?" ఆశ్చర్యం, ఆనందం, ఒక్కసారిగా కలిగాయి

'పావనీ బాగున్నావా? యిద్దరి ముఖాలూ మార్చి మార్చి చూస్తోంది విశాలి

'లోనికి రా" పావని అనటంతో విజయ్ లోనికి నడిచాడు

'పిన్నీ ఈయన పేరు విజయ్ నాతోనే చదువుకున్నారు. ఈయన ద్వారా నాకు మంచి ఉద్యోగం రావచ్చు" ఆ మాట వినగానే విశాలి ముఖంలో రంగులే మారాయి.

'అలాగా లోనికెళ్ళి కూర్చుని మాట్లాడుతూ వుండు, నే కాఫీ తెస్తా అప్పటివరకూ అదోలా చూస్తూ యక్ష ప్రశ్నలు వేసిన ఆవిడ ముఖం అలా మారటం నిజంగా ఆశ్చర్యం వేసింది విజయ్‌కి మెల్లగా చిరునవ్వు నవ్వాడు

'కూర్చో వుత్తరానికి సమాధానం రాలేదేమిటా అని యిప్పుడే అనుకుంటున్నా'

"మనిషినే వచ్చాగా" అతని ముఖంలో కళ కన్పించలేదు పావనికి.

'అదే యేదో విశేషం వుండాలి" లేని నవ్వు తెచ్చుకుంటూ అంది పావని

'లేకపోతే రానా?' కళలేని నవ్వు నవ్వాడు

"మనిషివి చాలా నీరసంగా కన్పిస్తున్నావ్" పావని అతని వంకే చూస్తూ అంది

'అదా' మనిషి మనిషి కాదనీ మృగమనీ తెలిసి'

"అబ్బా చాలా హెవీగా మాట్లాడుతున్నావ్ అతని వంక అదోలా చూసింది

'తప్పనిసరి అయి

అర్థం అయేలా చెప్పు" పావని దీనంగా చూసింది

'నీతో చాలా మాట్లాడాలి' విజయ్ తల దించుకుంటూ అన్నాడు

ఏమిటి విజయ్ నీవనేది?'

మనసు విప్పి చాలా చెప్పాలి'

ఇక్కడొద్దు యీ యింట్లో నేనో బానిసను విజయ్' కన్నుల్లో నీరు.

'పావనీ

మరేం మాట్లాడకు'

'యిక్కడ మాట్లాడటం వీలుపడదా?

ఔను'

'సరే నేను లాడ్జిలో దిగాను వీలయితే రాగలవా?'

'లాడ్జిలో దిగావా?

'ఔను

'నన్ను క్షమించు విజయ్ నాలుగు రోజులు యిక్కడ నీకు ఆతిధ్యం యివ్వలేనందుకు' కన్నీరు జారుతుంది

"పరవాలేదు మన రెండు జాతకాలూ ఒకేలా ఉన్నాయి' కన్నీరు తుడిచాడు

జరిగిన కథ-3: లక్షల ఆస్తికి వారసుడయిన విజయ్ తల్లి తండ్రిలేని అనాద పావనికి తల్లి లేదు స్కాలర్‌షిప్‌తో చదువుకుంటోంది రోజీ, దినేష్, మదన్,ఆనందరావులు విజయ్, పావనిల క్లాస్‌మేట్స్ తనను అవమానపరిచిన పావని మీద కారాలు, మిరియాలు నూరుతూ వెళ్ళిపోతాడు మదన్ విజయ్,పావని ప్రేమించు కుంటారు పెళ్ళి చేసుకోవాలని కలలు కంటారు పరీక్షలు ముగిశాయి పావని విజయ్‌ని వదిలి వెళ్లాలంటే బాధగా ఉందని కన్నీరు పెట్టుకుంటుంది ఆమెను అనునయిస్తాడు విజయ్ పావని సవతి తల్లి దగ్గరకు వచ్చింది విజయ్ మామ కూతురు లతను వివాహం చేసుకోనని చెప్పగానే మామ అసలు స్వరూపం బయట పడింది చెప్పలేని ఆవేదనతో అర్ధరాత్రి మామ ఇట్లోంచి బయటపడ్డాడు విజయ్

"అంటే"

తర్వాత చెబుతాను రేపొస్తావా?"

'తప్పకుండా' అంతలో విశాలి కాఫీ తెచ్చి అందించి -

'అమ్మాయి చాలా తెలివిగలది ఆ విషయం మీకు తెలుసు ఎలాగయినా మంచి వుద్యోగం చూసి పెట్టండి బాబూ ఈ సంసార భారమంతా అదే మొయ్యాలి మీ పుణ్యం మరచిపోము వినయంగా అంది విశాలి వింటున్న విజయ్‌కి మతిపోయింది

"చెప్పాగా పిన్నీ తప్పక సహాయం చేస్తారని '

'మీ మేలు మర్చిపోలేం" చేతులు జోడించింది విశాలి తరువాత కాసేపు మాట్లాడి గంపెడు భారంతో లాడ్జి చేరాడు ఆ రోజు రాత్రి పావనికి నిద్ర కరువయింది ఎప్పుడు తెల్లవారుతుందా, యెప్పుడు విజయ్‌ని కలుసుకుందామా అనే తొందరా, యేం చెబుతాడో నని ఆతురతా, మనసంతా ఒకే బాధ

* * * * * *

స్కూలుకెళ్ళి సెలవు చెప్పి తిన్నగా లాడ్జి చేరింది విజయ్ పావని కోసమే ఎదురు చూస్తున్నాడు.

"రా పావనీ నీ కోసమే ఎదురు చూస్తున్నాను

ఇప్పుడు చెప్పు విజయ్ ఏం జరిగింది?

'ముందు కాఫీ తాగి'

"ఇప్పుడేమీ వద్దు'

ఫరవాలేదు బాయ్‌ని పిలిచి కాఫీ తెప్పించాడు

తీసికో" అందించాడు

'చెప్పు విజయ్'

అంత తొందరగా వుందా?'



# పావని

రాత్రంతా నిద్రపోలేదు

ఊహించాను

చెప్పు మరి?

నే చెప్పేది విని భరించగలవా పావని కాస్త జంకింది

నిండా మునిగాక చలి వుండదు నువేం చెప్పినా భరించగలను. నాకు కష్టాలూ కన్నీళ్లు అలవాటే బహుశా అవి నాతో బుట్టువులు

'వేదాంతం మాట్లాడుతున్నావ్ విజయ్ జీవంలేనట్టు నవ్వాడు

ఎలా అర్థం చేసుకున్నాసరే విషయం చెప్పు'

'తెగతెంపులు చేసుకొని వచ్చాను

అంటే! ఆశ్చర్యంగా అడిగింది విజయ్ కూచున్న చోటు నుంచి లేచి కిటికీ దగ్గరగా నిలబడ్డాడు

'చెప్పు విజయ్' తొందరచేసింది పావని

ఇక నాకీ ప్రపంచంలో నువు తప్ప యెవరూ లేరు

'నువేం మాట్లాడుతున్నావో నాకర్థం కావటంలేదు

నాకర్థమౌతుంది..

అయోమయంగా చూసింది అతని ముఖంలోకి

ఆస్తినీ, బంధుత్వాన్నీ, అన్నిటినీ వదలుకున్నాను నీ కోసం త్యాగం మాత్రం చేయలేదు ఇంతకాలానికి వాళ్ల నిజరూపం తెలుసుకున్నాను వాళ్లకు నాపై వున్న ప్రేమా - అభిమానం - చా వాళ్లను గురించి మాట్లాడినా పాపమే

'ఆవేశంగా మాట్లాడుతున్నావ్ కన్నీరునిండుతూంది పావని కన్నుల్లో

ఆవేశం' అదే చివరకు మిగిలింది' చాలాసేపు మౌనం

పావనీ మన పెళ్లి విషయం రేపే మీ పిన్నితో మాట్లాడుతాను

దయచేసి ఆ పని మాత్రం చేయకండి

అంటే ,

ఆమెకి విషయం తెలిస్తే నాకీ జన్మకు పెళ్లికానివ్వదు

పావనీ

ఆశ్చర్యపోకండి నా డబ్బుతో ఆమె బిడ్డల బవిష్యత్తుకు బాట నిర్మించాలని ఆవిడ తాపత్రయం

"అందుకని?'

నాపెళ్లి జరగనివ్వదు

మరి మన పెళ్లి?

మనిద్దరి యిష్టం మీదే జరిగిపోవాలి'

'బాగుంది పెద్దగానవ్వాడు

ఎందుకు నవ్వుతావ్?'

'ఏడవలేను గనుక

'ఎందుకేడవాలి పావని కన్నీరు తుడుచుకుంటూ అంది

ఇద్దరం అనాథలలాగే మిగిలాం గనుక మనిద్దరికి నా అనేవాళ్లు లేరు ఉన్నా స్వార్థపరులని తెలిసి

"విజయ్ అంటూ బోరున ఏడిచింది

"పిచ్చిదానా ఎందుకేడుస్తావ్

నా కోసం నువ్వు కావాలని కష్టాలు కొని తెచ్చుకున్నావ్'

ముందే చెప్పాగా నాది త్యాగం కాదని'

నాకు భయంగా వుంది విజయ్

'ఇందులో భయపడాల్సింది ఏముంది? మన పెళ్లి మన యిష్టప్రకారం జరుగుతూంది అంతే చదువుంది, డిగ్రీ వస్తుంది బ్రతకగలమనే నమ్మకముంది యింకేం కావాలి?

"విజయ్' అతని మీద వాలిపోయింది

"ఏడవటంకాదు కర్తవ్యం ఆలోచించాలి'

'ఏం చెయ్యను చెప్పు'

'ఈ రాత్రే వెళ్లి మనం పెళ్లిచేసుకుందాం ధైర్యంగా అన్నాడు విజయ్

'నీ మాట నేనెప్పుడూ కాదనను విజయ్'

చాలా థాంక్స్

"కానీ '

ఏమిటి? నీ సందేహం

ఏదయినా వుద్యోగం వచ్చాక

నీకా భయం వద్దు మనం ఆనందంగా బ్రతుకగలమనే ధైర్యం నాకుంది చాలా? ఆమె భుజం తడుతూ అన్నాడు విజయ్

ఆ రాత్రి లోకం దృష్టిలో, సవతి తల్లి నోటిలో పావని లేచిపోయింది కాని ఆమె మనసులో కోరుకున్న వ్యక్తిని చేరుకుంది పావని కోసం వేచివున్న విజయ్ పావని రాగానే బయలుదేరాడు యిద్దరికి ఎక్కడికెళ్లాలో తెలియదు గమ్యంలేదు ఆలోచనా రాలేదు రైల్వేస్టేషన్ చేరారు విజయవాడకు రెండు టిక్కెట్లు కొని రెడీగా వున్న రైలు ఎక్కారు కష్టసుఖాలతో పనిలేని రైలు వేగంగా ముందుకురుకుతూంది

జీవితంలో మొదటి మెట్టే పాకుడు పట్టినట్టుగా కన్పించగా ఒకరికొకరికి తోడుగా జారకుండా గట్టిగా పట్టుకొని రెండవ మెట్టు ఎక్కడానికి ప్రయత్నించారిద్దరూ లక్షల ఆస్తికి వారసుడు విజయ్ చుట్టపక్కాలున్నారిద్దరికి కాని దిక్కులేని అనాథలుగా రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్లి నిర్ణయించుకున్నారు ఆ రోజు ఉదయం పావని కన్నుల్లో నీరు నిండి జలజలా రాలింది

పిచ్చి పావనీ ఎందుకా ఏడుపు?

'కన్నీరు కాదండీ ఆనందం జీవితంలో మొదటి మెట్టే భయంకరంగా కన్పించి భయపెడుతూంది'

కష్టాలూ కన్నీరూ కలకాలం వుండవు

"అని తెలుసండీ అయినా ఏదో బాధ

'ఆ బాధే వద్దనేది మనకెవరూ లేరు నాకు నువ్వు నీకు నేను అంతే

ఆ వుదయం రిజిస్ట్రారాఫీసులో యిద్దరికి పెళ్లి జరిగింది యిద్దరూ భార్యాభర్తలయ్యారు

పావనీ, ప్రస్తుతానికి నీకు నేను చీరలూ, నగలూ యివ్వలేను పసుపుతాడు తప్ప" అతని కంఠంలో బాధ తొంగి చూసింది

'అవేం మాటలండి ఏనుగంత బలాన్నిచ్చింది పసుపుతాడు [illegible] ఇల్లాలుగా నిలిపింది పసుపుతాడు నాకింతకంటే ఇంకేం [illegible]

# శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

ఎవడు నింపెను వాసన నింగువందు?
నారికేళాన నెవ్వాడు నీరు నింపె?
కోకిలకు పంచమ శ్రుతి గూర్చె నెవడు?
తేటులకు ఝంకృతి శ్రీల దిర్చె నెవడు?

ఆత్మలింగమ్ము కలదు దేహమ్మునందె
దాని పూజించుటెరుగక, దారు శిలల
జెక్కి చేసిన ప్రతిమ పూజింతు వీవు
అరసి చూడంగ నద్ది అన్యాయమయ్యె

అన్నమో హరా! భర్గా యటంచు, వచ్చు
జంగమున కీక తిననట్టి లింగమునకు
వేడ్కతో ప్రసాదమ్ము నైవేద్యమిచ్చు
నల్పులను జూడ పాడమదె యబ్బురమ్ము

–కనమలూరు వెంకటశివయ్య

# పావని

అంటూ అతని పాదాల మీద వాలిపోయింది లేవనెత్తి మొదటిసారిగా హృదయానికద్దుకొన్నాడు విజయ్

* * * * * *

జీవితంలో మొదటి రాత్రి మరపురానిదంటారు గదిలో మంచానికి మల్లెలు కట్టి బూరుగు దూది పరుపూ, పైన తెల్లని దుప్పటి, ఆపైన పరవశింపజేసే పువ్వులూ, కమ్మని ఫలహారాలూ, మత్తుగా మైమరపించే అగరువత్తులూ, తెల్లని జరి చీరతో కన్నెవయసులో కన్న కలల బరువుతో హంస నడకలతో గదిలో కొచ్చే పెండ్లికూతురూ, లాల్చి పంచా ధరించి సెంటు వాసనలతో కొత్త కొత్త కోరికలతో నిలువెల్లా పులకరించే పెళ్లికొడుకూ . మంచి ముహూర్తంలో యిద్దరినీ గదిలోకి పంపుతారు పెద్దలు యిది లోక రివాజు కానీ వీటన్నిటికి విరుద్ధంగా మొదటి రాత్రి గదిలో చాపపై విజయ్ బాధగానో, ఆనందంగానో తెలియని అవస్థలో కూచున్నాడు నెమ్మదిగా వచ్చింది పావని సాధారణమయిన చీరతో కింద నుంచి పైవరకు ఓసారి చూశాడు విజయ్

ఎందుకలా చూస్తారు? కొత్త కాదుగా

కావచ్చు కానీ ఈ రాత్రి కొత్తదేగా సిగ్గుపడింది పావని

కూర్చో కూర్చుంది విజయ్ దిండుపై తలపెట్టి పడుకుని పావని ముఖం తన గుండెలపైపెట్టుకొని-

'మన తొలి రాత్రి అన్నిటికి విరుద్ధంగాలేదూ?'

అలా అని ఎందుకనుకోవాలి?

ఏవేవో చదివాను, విన్నాను యిద్దరినీ గదిలోకి పంపి తొంగిచూడటం, అల్లరిచేయటం జరుగుతుందిట కాని మనకా బాధ లేదు కదూ?' మారు పల్కలేదు పావని

మాట్లాడవేం పావనీ ఎదిరించి పెళ్లి చేసుకున్నాం ఓ విదంగా మనం చాలా జాగ్రత్త తీసుకోవాలి మనల్ని చూసి వేలెత్తి చూపి నవ్వే స్థితికి దిగజారకూడదు.

నామీద మీకు నమ్మకంలేదా?

'పూర్తిగా వుంది కాని చెప్పటం భర్తగా నా విధి'

ఆచరించటం భార్యగా నా బాధ్యత'

ఆ మాటలు చాలు పావని ఆమె ముఖంమీద ముద్దుల వర్షం కురిపించి ఒక్కసారిగా తన కౌగిలిలో బందించి ఒక్కటిగా చేరారు

* * * * *

బానుడు తన వెచ్చని కాంతులతో వెలుగును ప్రసాదించాడు నిద్ర నుంచి కళ్ళు తెరచింది పావని లేచి బాత్‌రూము వైపు నడిచింది.




తళ్ళారా స్నానంచేసి బొట్టుపెట్టుకొని కాఫీతో వచ్చింది.

ఏమండి లేవండి'

అప్పుడే అంటూ పావన్ని దగ్గరకు లాక్కున్నాడు

'ప్లీస్ లేవండి అతని చేతిని బలంగా తీసింది

అప్పుడే ఏం తొందర?'

ఈవాళ రిజల్ట్సు రావచ్చున్నారు". ఆ మాట వినగానే లేచాడు కాఫీ అందించిన పావని ముఖంలోకి చూచి -

దేవత ముఖం చూసాను, అన్నీజయాలే'

చాలు లేచి స్నానం చేయండి

'ఒక్క క్షణం' గబ గబా నడిచాడు అన్ని పనులూ ముగించాడు

త్వరగా వచ్చేయండి మీకోసం ఎదురు చూస్తుంటాను పావని చిరునవ్వుతో అంది.

అలాగే తలుపేసుకో వెళ్లిపోయాడు అలా బైటికెళ్లిన విజయ్ ఉల్లాసంగా ఈలవేసుకుంటూ వచ్చాడు అతని కొసమే ఎదురు చూస్తూ కూర్చుంది పావని అతన్ని చూడగానే -

ఏమండి వచ్చాయా?

ఏం వచ్చాయి?

'అబ్బాఏడిపించక చెప్పండి

ఏం చెప్పమంటావ్'

అదే రిజల్ట్సు

ఆఁ వచ్చాయి'.

మీరు ఉత్తీర్ణులయ్యారా?'

ఔను

"చాలా సంతోషం ఆనందంగా మెరిశాయి కళ్ళు

మరి నీ విషయం అడగవేం?

యింకా దేనికి? నా ధైర్యం గెలిచింది నేనేమయినా పర్వాలేదు

అంటే?

నేను పాసయినా కాకపోయినా ఒకటి

అబ్బా మొగుడి మీద ఎంత ప్రేమ మరి ఈ శ్రీవారికి శ్రీమతిగారిచ్చే ప్రజంటేషన్ ఏమిటో?

ఏం కావాలి?

అడిగిందిస్తావా?

నా దగ్గరుంటే'

ఉన్నదే అడుగుతాను'

అడగండి

ఓ ముద్దు ఆమె ప్రమేయం లేకుండానే కానిచ్చాడు పావని నీకు సెకెండ్ క్లాసు

"సంతోషం

నిజంగా నేనెంత అదృష్టవంతుణ్ణో"

అదృష్టం మీదికాదు నాది

'ఇద్దరిదీను నవ్వుతూ అన్నాడు విజయ్.

ఆ రోజు సంతోషంగా గడిచిపోయింది తరువాత విజయ్ విశాఖపట్నం వెళ్లి మార్కులూ సర్టిఫికెట్లూ అన్నీ తీసుకొన్నాడు ప్రొఫెసర్ రిసర్చి చేయమని ఎంతగానో చెప్పాడు విజయ్ వుద్యోగ ప్రయత్నంలో వున్నానని క్షమించమని చెప్పి వచ్చేశాడు మంచి ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టాడు కొన్ని ఇంటర్వ్యూలకు కూడా వెళ్లాడు వుద్యోగం తప్పక వస్తుందని ఎదురు చూశాడు చివరకు నిరాశే మిగిలింది మార్కులూ, తెలివితేటలూ, గోల్డ్ మెడలే కాదు ముఖ్యం రికమెండేషనూ, డబ్బూ అని విజయ్‌కి తెలిసి రావటానికి ఎంతో కాలం పట్టలేదు ఈలోగా ఓ కమిటి కాలేజిలో ట్యూటర్‌గా పోస్టు వచ్చింది. పరిస్థితిని అర్థంచేసుకున్న విజయ్ రాజీపడి వుద్యోగంలో చేరాడు. కాలేజి నుంచి ఇంటికి వచ్చాడు విజయ్. చిరునవ్వుతో ఎదురు వెళ్లింది పావని విజయ్ చాలా డల్‌గా కనిపించాడు

ఏమండి అదోలా వున్నారు?' కాఫీ అందిస్తూ అంది పావని.

"విధి మనల్ని ఇంత చిన్న చూపెందుకు చూస్తుందని?"

"ఇప్పుడేమయింది?"

"ఏం కాకూడదో అదే అయింది".

"అర్థంకాలేదు".

"సెకెండ్ క్లాసులో పాసయినవాడికి లెక్చరర్ పోస్టూ, నాకు ట్యూటర్ పోస్టూ నిజంగా నాకు వెంటనే రాజీనామా చెయ్యాలనిపించింది".

"తొందరపడకండి".

"అందుకే నిదానించా".

"చూడండి న్యాయం, ధర్మం వుందనే నా నమ్మిక. మనం నమ్మిన భగవంతుడు అన్యాయం చెయ్యడు. కొన్నాళ్ళీ అధర్మాన్ని అందలం ఎక్కి గంతులు వేయనీయండి. అవినీతి తప్పక అంతరిస్తుంది. నీతీ, న్యాయం నిలబడక తప్పదు" ధైర్యం చెప్పింది.

"నిజంగా మనకు మంచి రోజులు వస్తాయంటావా?"

"తప్పక". అతని ముంగురులు సరిచేస్తూ అంది.

ఆ రాత్రి అతని గుండెలపై తల ఆన్చి -

"ఏమండీ?"

"ఆఁ." భార్య ముఖంలోకి చూశాడు.

"అదే ఆ కాన్వెంటులో టీచరుగా చేరమని".

"అదా" తేలిగ్గా అన్నాడు.

"మిమ్మల్ని కనుక్కొని విషయం చెబుతానన్నాను". చాలాసేపు మౌనం.

"మాట్లాడరేమండీ" మళ్ళీ పావనే అంది.

"పావనీ నాకెందుకో చిన్నప్పటి నుంచీ ఓ భావం. అదేమంటే మగవాడు కష్టపడి సంపాదించాలి. స్త్రీ గృహిణిగా తన బాధ్యత నిర్వహించాలి. నా భార్య వుద్యోగం చేయటం నాకేమాత్రం యిష్టంలేదు". అతని మాటలు విన్న పావని ముఖంలో రంగులు మారలేదు. చిరునవ్వు నవ్వింది.

"నా భావం చెప్పాను. ఇక ఆపై నిర్ణయం నీదే పావనీ".

"నా నిర్ణయమంటూ లేదు. మీ నిర్ణయమే నాది" అతని కౌగిలిలో ఒదిగిపోతూ అంది పావని. ఆమె కౌగిలిలో పసిపాప అయ్యాడు విజయ్.

* * * * * *

పావని అద్దెకుంటున్న ఇంటికెదురుగా మూడు పెద్ద పెద్ద భవంతులున్నాయి. ఆ మూడు భవంతులకూ మూడు ప్రత్యేక చరిత్రలున్నాయి. మొదటిది వ్యభిచారగృహం. సుశీల ఆ గృహ నిర్వాహకురాలు. అందమయిన అమ్మాయిలతో అతి అందమయిన వ్యాపారం సాగిస్తూంది. సాధారణ వ్యక్తులెవరూ ఈ కాంపౌండులో కాలు పెట్టలేరు. ఒక రాత్రికి రెండువేలు ఖర్చుపెట్టగల సమర్థులే అక్కడికెళ్ళటానికి అర్హులు. రసిక రాజులతో పాటు మందు తాగుతూ సిగరెట్టు కూడా తాగుతుంది సుశీల. సంఘంలోని ప్రముఖులూ, పెద్దమనుష్యులూ ఆవిడ దయాభిక్షకోసం ప్రాకులాడుతారు.

ఇక రెండవది అవధాని గృహం. అవధాని ప్రజల దగ్గర నుంచి డబ్బు సునాయాసంగా ఎలా సంపాదించాలా? కష్టపడకుండా వేలు ఎలా గడించాలా? అని చాలా రోజులు ఆలోచించాడు. అనవసరంగా ఎవరూ పైసా ఇవ్వరు. అందుకే ప్రజల బలహీనత తెలుసుకున్న అవధాని తేలిగ్గా డబ్బు సంపాదించగల మార్గం కనిపెట్టాడు. మాయలుచేసి డబ్బు సంపాదించేందుకు కేరళకు పోయి ఒక మంత్రవేత్త దగ్గర కొన్ని విద్యలు తెలిసిన త్రాచుపామును కొని దానిని మహిమలుగల దేవునిగా ప్రజల ముందుంచాడు. వుదయం పుట్టలో నుంచి కొలనులో స్నానంచేసి నోటితో పూలు కోసి శివలింగం చుట్టూ ప్రదక్షిణలు చేసి పూలువేసి భక్తులు పెట్టే పాలారగించి, పుట్టలోకి వెడుతున్న పామును చూచి, మంచి చెడ్డ విచక్షణలేని జనం తండోపతండాలుగా రాసాగారు. పుట్టకు చుట్టూ గుడి కట్టారు. మితిలేని కానుకలతో ముంచేసినారు. తిరునాళ్ళు తీర్థాలు ఏర్పాటయి రోజులో గల ఇరవై నాలుగు గంటలూ తమ తమ కోరికలు నెరవేర్చే ఇలవేలుపుగా భ్రమింపచేసి స్థిరంగా నిలిచేటట్లు చేశాడు. స్వామి పూజకుకావలసిన వస్తువులు కొబ్బరికాయలు, అరటిపండ్లు, కర్పూర, తాంబూల సుగంధ వస్తువులమ్మే అంగళ్ళూ, వచ్చిన జనానికి క్షుద్బాధా నివృత్తికై కాఫీ ఫలహారశాలలూ చాలా వెలిశాయి కోవెల చుట్టూ. ప్రజల

# పావని

మూర్ఖత్వానికి అందంగా నవ్వుకుంటూ వంటి నిండా విభూతి రేఖలు, మెడనిండా బంగారం పట్టు వస్త్రాలు, యింద్రభవనంలాంటి ఇల్లు, పుష్పక విమానంలాంటి కారుతో మిగిలాడు అపధాని అందంగా

యిక మూడవది చందన్‌లాల్ గృహం. వడ్డీ వ్యాపారం చేస్తూ బంగారం మొదలుకొని ఇనుం వరకూ తాకట్టు పెట్టుకుని మూడు నుంచి పది రూపాయల వరకు వడ్డీ రేటు పెంచి ఒక రోజు గడిచినా ఒక నెల వడ్డీ గుంజి పేద ప్రజల రక్తం పిండి ఆ రక్తంతో నే భగవంతుడికి దీపారాధన చేస్తూ లక్షలార్జించి సుఖసంతోషాలతో హాయిగా కాలం గడుపుతున్నాడు

* * * * * *

రోజీ ఫస్టు క్లాసులో పాసయింది. ఉద్యోగాన్వేషణలో వుంది. ఆ సమయంలో దూరపు బంధువొకాయన రావటం జరిగింది

'రోజీ ఏం చేస్తుంది?" బంధువు జార్జి ప్రశ్న

"ఉద్యోగం కోసమే ప్రయత్నం" తల్లి విక్టోరియా సమాధానం.

"నో నో వుద్యోగం అంత త్వరగా రాదు".

"అంకుల్ నువ్వే ఏదయినా మార్గం చూపు" విక్టోరియా దీనంగా అడిగింది.

"ఆల్‌రైట్ ఓ మాజీ మినిస్టర్ నాకు బాగా తెలుసు. ఆయన పెద్ద హోటల్ మెయింటైన్ చేస్తున్నాడు. మన రోజీకేం మంచి అందగత్తె, తెలివయినది. పైగా పోస్ట్ గ్రాడ్యుయేట్. మంచి జాబ్ యిప్పించగలను."

"ఆ ప్రభువే నిన్ను పంపాడు అంకుల్ విక్టోరియా కళ్ళు ఆనందంగా మెరిశాయి

"నో నో నాదేంలేదు.

ఆ మరుసటి రోజు వుదయం జార్జితో రోజీ మాజీ మినిష్టర్‌గారింటికెళ్ళింది. ఆయన మాజీ మినిష్టర్ అయినా ప్రస్తుత మినిష్టిరిలో కూడా మంచి పలుకుబడి వుంది

"హలో జార్జి హవ్ ఆర్ యూ? ఎంత కాలానికి కలిశాం కూర్చో". కుర్చీ చూపించాడు

"ఫైన్ మీరెలా వున్నారు?" జార్జి కూచుంటూ అడిగాడు

"ఫర్వాలేదు ఆ అమ్మాయి ఎవరు?" రోజీ వంక అదోలా చూస్తూ అడిగాడు మాజీ. అతని చూపుల్లో ఏదో మత్తు వుంది

"నా మేనకోడలు కూతురు యం యస్ సి ఫస్టుక్లాసులో పాసయింది ఏదయినా వుద్యోగం కోసం"



"థేంక్ గాడ్ కరెక్టుగా తెచ్చావు'.

"వ్హాట్?"

"నా సెక్రటరి విదేశ పర్యటనకెళ్ళాడు మరో మినిష్టరుతో. నాకు సెక్రటరీగానూ, నా హోటల్ మేనేజిమెంటుకూ మంచి ఇంగ్లీష్ తెలిసిన నమ్మకమయిన వ్యక్తి కోసం వెదుకుతున్నాను". రోజీ ముఖంలోకి తదేకంగా చూస్తూ అన్నాడు

"రియల్లీ!" జార్జి ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ చూశాడు

'రియల్లీ" మాజీ రోజీ వంకే చూస్తూ అన్నాడు.

"మా రోజీ అదృష్టవంతురాలు"

"రేపే వచ్చి డ్యూటీలో చేరమను"

"థాంక్స్" రోజీ ధన్యవాదం చెప్పింది

'నో మెన్షన్" మాజీ చిరునవ్వుతో అన్నాడు.

అనుకున్న విధంగానే రోజి మరుసటి రోజు డ్యూటీలో చేరింది ఆ హోటల్ చూచి ఆశ్చర్యపోయింది! ఆ హోటల్లో తాగుడూ, అమ్మాయిలూ, పేకాట, డాన్సులూ అన్నీ వున్నాయి. కాని ఎవరూ ఆ హోటల్ జోలికి పోరు బహుశా భయం కాబోలు

"రోజీ అడ్వాన్సు అంటూ వెయ్యి రూపాయిలు అందించాడు మాజీ.

'మై గాడ్ వెయ్యా!" కళ్ళు తిరిగాయి రోజీకి

"ఇది చూసె భయపడితే ఎలా నీ కోసం చాలా ఇస్తాను కాని నీ సహాయం, సహకారం కావాలి

'ష్యూర్"

'ఈ హోటల్ నాదనేభావం రాకూడదు ఆ తరువాత మన హోటల్‌కొచ్చే ఫారినర్స్‌ని నీ తెలివితో ఆకట్టుకోవాలి లక్షలు నీ కాళ్ళ చుట్టూ తిరుగుతాయి" అతని చూపులో మత్తు హోటల్లో అతని కోసం ఏర్పాటయిన అద్దాల గదిలో ఒంటరిదయింది రోజీ తాగి మత్తుగా చూసాడు మాజీ.

"రోజీ ఎందరో వచ్చారి గదిలోకి కాని నేను మెచ్చింది నిన్నే ఈ ఆస్తి, హోదా అంతా నీ స్వంతం' అంటూ వయసు తారతమ్యం లేకుండా రోజీని సొంతం చేసుకున్నాడు కాలంతో రాజీపడింది రోజీ తాగటం మాత్రమే కాక యింకా ఎన్నో పనుల కలవాటుపడిపోయింది.

ఇప్పుడు ఇంద్రభవనంలాంటి ఇంట్లో ఇంఫాలా కారుతో గొప్ప గొప్పవారి కౌగిళ్ళలో లక్షల డబ్బుతో తాను తాగుతూ, వారిని తాగిస్తూ అందంగా కీ ఇచ్చిన గడియారంలా తయారయింది

* * * * * *

అత్తెసరు మార్కులతో పాసయాడు దినేష్. అతని తండ్రికి సంఘంలో హోదా, తగినంత పలుకుబడీ వున్నాయి. రాజకీయాల్లో ప్రవేశముంది.

'దినేష్ నీకు ఎలాంటి జాబ్ చేయాలని వుంది?" తండ్రి ప్రశ్న.

"కోరిక ఉండగానే సరా? రావద్దూ!" దినేష్ నెమ్మదిగా పలికాడు

"ఆ దిగులు నీకేం వద్దు చెప్పు"

"నా మార్కులు? నసిగాడు.

"ఈ రోజుల్లో మార్కులకు కాదురా వుద్యోగం. పలుకుబడికి".

'అంటే?'

"అదంతా దేనికి? టైం వేస్టు చెయ్యక చెప్పు".

"మీరనేది?"

"అబ్బా. విసిగించక చెప్పు'

"పోలీసు శాఖలో!".

"అంతేగా! మొన్న పేపర్లో పడ్డాయిగా అప్లయి చేయి".

"అది ఫస్టు క్లాస్ వాళ్ళకి".

"నువ్వు అప్లై చెయ్ ఆపై సంగతేదో నే చూసుకుంటా". వెళ్ళిపోయాడు తండ్రి. తండ్రి మాట ప్రకారం అప్లయ్ చేశాడు దినేష్ ఆశ్చర్యం!వారం తిరక్కుండా ఇంటర్వ్యూ రావటం, నాలుగు రోజులకల్లా అపాయింట్‌మెంట్ రావటం జరిగింది. ఇప్పుడు పోలీసు శాఖలో వున్నతోద్యోగంలో వున్నాడు దినేష్.

**(ఇంకా ఉంది)**

# బైద్యనాథ్ ..............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు ఆనందముగా ఉండుటకు శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి రోజు రోజుకు సంవత్సరముల తరబడి విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.




## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉద్భుడు పొక్కులు మరియు చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా ఉంచును,






## బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.




మామూలు పండ్లపొడేకాదు ఔషధముకూడా దంతక్షయము మరియు చిగుళ్ళ వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాథ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్ ఆయుర్వేద పండ్లపొడి

83P 97T




**ఎస్. పి. కె; వేములవాడ**

★ రాజకియ నాయకులు తెల్ల ఖద్దరు ఎందుకు ధరిస్తారు?

● పూర్వం ఖద్దరు మీది గౌరవం చేత ఇప్పుడు- మనసులోని భావాలు తెలియకుండా వుండడానికి. (మనసులోని కుళ్ళు ముఖం చాటుతూనే, వుంటుదన్న సంగతి మర్చిపోయారు!)

**పి. ఆర్ బి. కోటబొమ్మాళి**

★ ప్రేమ పేదరికాన్ని ఆదరిస్తుందా?

● ఆదరించాలనడం కావ్య లక్షణం కాని పేదరికంలో ప్రేమ పెరగలేదన్నది – అనుభవం నేర్పే పాఠం

**జి. ఐ. కె. సికింద్రాబాదు**

★ కొత్త మందులు మరీ ప్రమాదరం అంటారో నిజమేనా?

● తెలియదయ్యో. కాని ఒక్కటి - కొత్త మందులు వాడకపోతే - కొత్త రోగాలని ఎదురు చూడవచ్చునేమో!

**పి.డి.ఆర్. ఖర్గపూరు**

★ దాన ధర్మాలు చేస్తే పుణ్యం వస్తుందనే నమ్మకంతో మన దేశంలో ముష్టివాళ్ల సంఖ్య క్రమేపి పెంచి పోషించి చాలా మందిని సోమరి పోతులుగా మారుస్తున్నాం మనం చెమటోడ్చి పైసా సంపాదించే సగటు మనిషిగానీ, ప్రభుత్వంగానీ వీళ్ల గురించి పట్టించుకోరు అన్యాయం కదూ?

● కష్టాని కెప్పుడూ ఫలితం సరిగా దక్కని దేశం మనది అందుకే పుణ్యం పేరుతో ముష్టి వేసి స్వర్గ-ద్వారాలు తెరచి వుండేలా చూసుకుంటాం. శ్రమకి ఫలితం దక్కితే- యింత మంది పేద లెందు కుంటారు? ముష్టి వాళ్లకున్న రక్షణ కూడా సగటు మనిషికి లేదినాడు వాళ్లకి బెగ్గర్ హోము లున్నాయి. తిండికి నీడకి ఢోకా లేదు ఇక వారానికో రోజు "ముష్టెత్తుకొండి" అని పంపిస్తారని కూడా విన్నాను

**బి. ఏ. కె. శ్రీకాకుళం**

★ కట్నం తీసుకుంటే మి దృష్టిలో మంచిదా కాదా?

● కట్నం – ఉన్న వాళ్ళు యివ్వడం, లేని వాళ్ళు యివ్వ లేక పోవడం అన్నది కాదు తమ సౌకర్యాలు అమర్చు కోడం కోసం – తమ సుఖం కోసం తెచ్చుకుంటున్న కన్నెపిల్లే ధనాదులు సమకూర్చాలనడం – చాలా సిగ్గుపడ వలసిన విషయంగా అన్పిస్తుంది నాకు జీవితాంతం పోషిస్తాం కనుక కట్నం అంటారు • వాళ్ళింకా సిగ్గు లేని వాళ్ళు. పెళ్ళాన్ని పోషించ లేని వాడు పెళ్ళికి సిద్ధపడ కూడదు ఆ సోమతు కల్గినప్పుడు పెళ్ళాడాలి.

**ఎస్. ఐ. సంగం జాగర్లమూడి**

★ కోటికి పడగలెత్తిన ధనవంతుడు నీ ముంగిట సామాన్యుడు అని బాకా మ్రోగిస్తూనే ప్రత్యేక దర్శనాలు పెట్టి దేవుడికి బంగారు టోపీలు ఎట్టడం భక్తులను బహిరంగంగా ఫూల్సని చేయడమే అనుకుంటా.

● భక్తి – కొండెక్కగానే పోతుంది! ఎలా గుళ్ళోకి వెళ్ళాలి! ఎలా తిరిగి రావాలి? ఎలా లడ్డు కొనాలి అన్న బెంగ మినహా దేవుడి జ్ఞాపకం వుండదు! అది వైకుంఠమార్గం కాదు నరక యాత్ర. ఆ టీవీ గోల ఆ పాటల హోరు. పాప్ కార్న్ · థియేటర్లలోలా వుంది! బాబోయ్! తిరుపతి మాట ఎత్తవద్దు

**ఎ. ఐ జి. ఎస్. ఎమ్ చీరాల**

★ అజ్ఞానం అలసత్వం దరిద్రం వీటి నడుమ పెరిగే పిల్లలకు ఎటువంటి పరిస్థితులు ఎదురౌతాయి? వాళ్లకి మంచి భవిష్యత్తు వుంటుందా?

● చెప్పలేం మీరు చెప్పినవి వారిలో పట్టుదల పెంచినా మనం ఆశ్చర్య పడక్కర లేదు ఈ మధ్య చాలా రోజులే అయింది- మద్రాసు టి వి వాళ్ళు ఓ కాగితాలేరుకునే ఐదారేళ్ల కుర్రాడి దిన చర్య చాలా చక్కని చిత్రంగా తీశారు ఆ అమాయకపు కళ్లలో వెల్గే ఆశలు , సంపాదించి తల్లిని చెల్లిల్ని చిన్న తమ్ముడిని పోషించడంలో ఆ పసివాడు చూపిన హుందా గర్వం- చాలా బాద కల్గిస్తాయి మనకి కాని వాడికదొక- ధర్మయుద్ధమే 'అరె నన్నీ స్థితిలో వుంచింది అమ్మ అన్న- నిరాదరణ ఏ కోశానా కనపడలేదు ఆ కుర్రాడు నటుడు కాదు- నిజజీవి. అంచేత దరిద్రంలోంచి పౌరుషంగా బ్రతకడం పుడుతుందని అనిపించింది పెద్దలు తమ భేషజాలు పిల్లల మీద రుద్దకుండా వుంటే – వాళ్ళు జీవన పోరాటం సాగించుకుంటూ గెల్పో ఓటమో తామే బాధ్యులమని పెరుగు తారేమో

★ నిత్య రోగంతో నిరాశతో కృంగి పోయే వ్యధిత జీవులకు మీరిచ్చే సలహా.

● విప్లవ కవిత్వం చదవమనీ కాదు! మూలుగుతున్న కొద్ది రోగం హెచ్చుతుంది నిరాశ కృంగతీస్తుంది మూలుగు తగ్గించి రోగంతో పోరాడడం ముఖ్యం ఆశ ఎంత ధైర్యానిస్తుందో నిరాశ అంత కృంగతిస్తుంది

**ఎమ్.ఆర్.డి. బళ్ళారి**

★ టి వి ప్రోగ్రాముల గురించి మి అభిప్రాయం ఏమిటి?

● నేను ఇంకా టి.వి రోగిని కాదు! మా వూళ్ళో తెలుగు ప్రోగ్రాము తెలుగువాళ్ల పరువు తీస్తోందని అంతా గోల పెట్టడం మాత్రం విన్నాను నేను అరవ నాటకాలు, సంగీత కార్యక్రమాలు చూస్తాను. వార్తలు వింటాను- ఉదయం లేవగానే టి వి కార్యక్రమాలలో చూడదగ్గవి వున్నాయా అని చూస్తా లేకుంటె న్యూసుదాకే- వూరుకుంటా

★ అగ్రకులం వారై వుండి ఆచార వ్యవహారాలన్నీ ఎదిరించి మీలా నిలబడడానికి ధైర్యం కావాలి కదూ?

● ధైర్యం కంటే ముందు పిరికితనం వుండకూడదు! కులం దేనికి మనిషి కాకుండా! నాకు శాఖాహార మాంసాహార తేడాలేగాని మరేం అక్కర లేదు. అదైనా- నన్ను తినమనకుండా వుండడం దాకానే పట్టింపు నా పక్కన కూర్చుని తిన్నా నాకేం అభ్యంతరం లేదు ఇక ఎదిరించడం అంటారా? ఎవరి కాళ్ల మీద వాళ్ళు నిలవగలమని తెలిస్తే- చాలు. ముందుకి సాగవచ్చు. చుట్టుపక్కల వారేమనుకుంటారన్న బెంగ వుండదు! □






ప్యూను తెచ్చి పెట్టిన ఫైళ్ళు చూస్తున్నాడే గాని, వాటిపైన మనస్సు లగ్నం కావడంలేదు. పై జేబులో పెట్టుకున్న కన్నతల్లి వ్రాసిన ఉత్తరాన్ని తీసి, విప్పి ఫైల్లో పెట్టుకుని చదువసాగాడు. చదవడం బహుశ ఏ పదో సారి అనే చెప్పుకోవాలి

"చిరంజీవి చిన్నాను దీవించి, అమ్మ వ్రాయునది. అంతా క్షేమము. మీరూ క్షేమంగా వుండాలని నిత్యం భగవంతున్ని ప్రార్థిస్తాను. నేను నీకు వ్రాసిన ప్రతి వుత్తరంలోను డబ్బు ప్రసక్తి తీసుకు రావడం తప్పనిసరి అవుతోంది. అయినను నేను ఎంతో అవసరం వుంటే తప్ప వ్రాయనని నీకు తెల్సిందే. ముఖ్యంగా ఇంటి అద్దె కట్టమని, ఇంటాయన చాలా నిష్ఠూరంగా మాట్లాడుతున్నాడు. వారం రోజుల్లో అద్దె చెల్లించకుంటే ఇల్లు ఖాళీ చేయాల్సిందిగా హెచ్చరించాడు.

పోతే చెల్లాయి సుశీల పెద్దమనిషైంది. అందువల్ల అదనంగా కొత్త ఖర్చు వచ్చిపడింది. ఆచారం ప్రకారం ఏ కొద్దిమందినైనా పిలిచి బంతి పెట్టాలి, కొత్త బట్టలు, ఓణిలు కొనాలి. పొలంలో వచ్చిన తిండి గింజలు మొన్ననే అయిపోయాయి. బియ్యం కూడా నిండుకున్నాయి. సుశీల పదవ తరగతిలో పాసైన విషయం నీకు తెల్సిందే. తను ఇంటర్‌లో చేరతానని మారాం చేస్తోంది. టైపు నేర్చుకుంటోంది. ఎంతో కొంత మొత్తం సర్ది పంపిస్తే, తాత్కాలికంగా సంసారాన్ని నెట్టుకు వస్తాను.

కోడలు పిల్లను అడిగినట్లు చెప్పగలవు. బాబులిద్దరకు శుభాశిస్సులు. ఆరోగ్యం జాగ్రత్త. ఇక ఉంటాను.

సదా నీ క్షేమాన్ని కోరే
అమ్మ."

ఉత్తరం చదవడం పూర్తి చేసి భారంగా నిట్టూర్చాడు. నాన్న అక్కయ్య పెళ్ళికి ఇల్లు అమ్మేశాడు. ఇల్లు కాకుంటే ఉన్న ఎకరం పొలం అమ్మేయమని అంటే ససేమిరా ఒప్పుకోలేదు. ఇల్లు లేకుంటే వేరే ఎవరింట్లోనైన ఉండచ్చు కాని పొలం అమ్మితే ఆ నాలుగు తిండి గింజలు రాక కష్టమౌతుంది అనే ఉద్దేశ్యంతో ఇంటినే అమ్మేశాడు. పెళ్ళయిన కొద్ది రోజులకే గుండెపోటుతో మరణించడం జరిగింది. ఏ ప్రయత్నం లేకుండానే తనకి ఉద్యోగం రావడం జరిగిందంటే నాన్న మంచితనం వల్లే.

ఉన్న పొలం కౌలుకిచ్చేసి తనతో రమ్మంటే అమ్మ ఒప్పుకోదు. ఊళ్లోనే వుండి కూలో నాలో చేసుకుని బ్రతుకుతానంటుంది. తోడుగా చెల్లాయిని వుంచుకుంది. అయినా చాలి చాలని జీతాలు, ఇద్దరు పిల్లలు, తన సంసారానికే చాలదు. అమ్మ మాత్రం భారంకాదు.

ఆలోచిస్తున్నకొద్దీ ఏమి పాలుపోవడం లేదు. మూర్తికి. నెలాఖరు రోజులు. చేతిలో ఏమీలేదు. వేరే ఎవరి వద్ద నుంచైనా తెస్తే మళ్లీ సర్దడం చాలా కష్టం.

మూర్తి చివరకు ఈ విధంగా కూడా ఆలోచించాడు. తను పనిచేస్తున్నది. రెవిన్యూ డిపార్టుమెంటు, అందులోను తనది సివిల్ సప్లయిస్ విభాగం. తను కావాలని చేయి చాచాలే కాని, సాయంత్రానికి జేబులు నిండుతాయి. కాని మూర్తికి మనసొప్పదు. తండ్రి పేరు ధర్మరాజు. ధర్మం తప్పి ఎరగడు. నీతి, న్యాయం అంటూ జీవితకాలం పోరాడాడు. అందుకే కాబోలు తన పేరు సత్యమూర్తి అని పెట్టాడు అనుకుంటాడు. పరిస్థితులు ఎంత విషమించిన, తిండికి లేకున్నా పస్తులుండాలి తప్పితే నీతిమాలిన పనులు చేయవద్దని బోధించేవారు. నీతి, న్యాయం, ధర్మం ఆయన ఆరో ప్రాణం. అంతటి సచ్ఛీలత కల వ్యక్తి కడుపున పుట్టిన తను. ఆయన క్రమశిక్షణలో పెరిగి, నేడు లంచం పుచ్చుకుంటే ఆయన ఆత్మ శాంతించదు. పైగా తనను తాను వంచించుకోవడమే అవుతుంది.

"మరి ప్రస్తుత సమస్యకు పరిష్కారం-?" తల పట్టుకుని కూర్చున్నాడు మూర్తి.

"సార్ మీరు చాలా డల్‌గా కనపడుతున్నారు. తలనొప్పి వుంటే టీ తెచ్చి పెడ్తాను సార్ ...!" టేబుల్ వద్దకు వచ్చి ఆప్యాయతతో అడిగాడు ప్యూను లక్ష్మయ్య.

"అవును లక్ష్మయ్య! టీతో పాటు ఒక 'నవాల్జిన్' మాత్ర కూడా పట్టుకురా!" చెప్పాడు మూర్తి.

ఆఫీస్ టైమ్ పూర్తి కావస్తోందనగా లక్ష్మయ్య తెచ్చిన మాత్ర వేసుకుని టీ త్రాగి, ఫైళ్ళు, కాగితాలు వగైరా అన్ని తన బీరువాలో సర్దేసి తాళం పెట్టి, ఆఫీసులోంచి బయటకు వచ్చాడు. ఆఫీసు స్టాఫ్ తమ తమ స్కూటర్లు తదితర వాహనాలపై ఇళ్ళకు బయలుదేరి వెళ్ళున్నారు. డిపార్టుమెంటులోకి వచ్చిన సంవత్సరానికే వెహికల్స్ కొనేస్తున్నారు. న్యాయంగా, నీతిగా బ్రతికితే యిది సాధ్యమా? ఆలోచించుకుంటూ కాలినడకన సాగుతున్నాడు.

బజార్లోకి వచ్చాక గాని గుర్తుకు రాలేదు. భార్య చెప్పిన సరుకుల జాబిత. సరుకులు కొనడానికి డబ్బులేదు. కొనకుండా వెళ్తే వస్తు తప్పదు. సంవత్సరంలోని ప్రతినెల ఫిబ్రవరి అయితే కొంత నయంగా వుండేది. ఆలోచనల్లో పడి ఇంటికి చేరిన విషయం గమనించనేలేదు.

గడప దగ్గరే నిలబడిన భార్య" సరుకులు అన్ని తెచ్చారా?" అని అడగబోయి, వట్టి చేతులను చూసి ఆగిపోయింది.

లోపలికి అడుగు పెట్టగానే "మరేనండి పిల్లలిద్దరు ఈ రోజు స్కూలుకి వెళ్ళిన అరగంటకే వాపసు వచ్చారు. ఎందుకు అని అడిగితే ఏడుస్తున్నారే తప్పితే జవాబు చెప్పడంలేదు. కాస్త మీరైనా కనుక్కోండి" అంటూ మూర్తికి చెప్పింది భార్య శాంత.

ప్యాంటు విప్పకుండానే పక్క గదిలోకి నడిచాడు మూర్తి. ఆ గదిలో పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నారు ఇద్దరు పిల్లలు. దగ్గర వెళ్ళి కూర్చున్నాడు.

"నాన్నా ఈ రోజు స్కూలు నుండి వాపసు వచ్చారంట ఎందుకు?" పెద్ద బాబును బుజ్జగించి అడిగేడు.

ఒకసారి తండ్రి మొహంలోకి చూసి, మళ్ళీ విచారంగా పుస్తకంలోకి చూడసాగారిద్దరు. చిన్నవాడి వైపు చూసినా ఏమి చెప్పలేదు. ఏం అర్థంకాలేదు.

"చెప్పు నాన్నా!" అంటూ గదవ పట్టుకుని బ్రతిమాలాడు మూర్తి.

"మరి . మరి ఫీజు కట్టలేదని టీచరు వెళ్ళగొట్టింది. ఫీజు కడితేగాని స్కూలుకి రానీయనంది" అంటూ బోరున ఏడుస్తూ తండ్రి ఒడిలో ఒదిగిపోయారు.

గుండెను ఎవరో పిండినట్టయింది. ఫీజు పోయిన నెల కూడ కట్టలేదు. ఫీజు కట్ట లేదని రానీయలేదు. చదువు పట్ల పిల్లలకున్న ఆసక్తి ఈ విధమైన బాధల వల్ల చిన్నారుల మనస్సు గాయపడి చదువు పట్ల శ్రద్ధ పోతుందనిపించింది మూర్తికి. తలంతా మొద్దుబారింది. ఏమిటి కర్తవ్యం?

పిల్లలను ఊరడించి వాళ్ళిద్దర్ని లేవనెత్తి బాత్రూంకి తీసుకెళ్ళి వాళ్ల మొహాలు కడిగి, తను కడుక్కుని ముందు గదిలోకి వచ్చి టవల్తో తుడుస్తూ కుర్చీలో కూర్చున్నాడు.

# సంఘాలు

పదవుల్లో ఉన్న వారికి
పంపులు కొట్టే సంఘాలు కొన్ని
ఈర్ష్యాద్వేషాలతో 'కంపు' కొట్టే సంఘాలు కొన్ని
స్వార్థ చింతన లేని సంఘాలు ఎన్ని
సరిగ్గా చూస్తే చేతివేళ్ళన్ని!

—డా. బి. దామోదర్ రావు

# నీతి!

"ఇదిగోండి కాఫీ!" శాంత అందించిన కాఫీ తను గుక్కెడు తాగి, పిల్లలిద్దరకు తాగించాడు. అప్పుడు కాని వాళ్లలో ఉత్సాహం ఏర్పడలేదు. తుర్రున బయటకు పరుగెత్తికెళ్లారు పిల్లలిద్దరు.

అప్పటి వరకు మౌనంగా వున్న శాంత ... "ఏమండి . ఈ రోజు మధ్యాహ్నం మార్వాడి వచ్చి చాలా గొడవ చేసి వెళ్లాడు. బాబు ఆపరేషన్కి నా గొలుసు తాకట్టు పెట్టిన డబ్బు విషయం. వారం పది రోజులలో డబ్బు చెల్లించి గొలుసు పట్టుకుపొండి. లేదా తన డబ్బుకి గొలుసు చెల్లుబాటని చెప్పాడు ..." మెల్లిగా, ఊరాడుతున్న గొంతుతో చెప్పింది.

మరో దెబ్బ. నవనాడులు కృంగిపోయినట్టయింది. ఆర్థిక సమస్యలు ఒకటి వెంట ఒకటి వచ్చి పడుతున్నాయి. భగవాన్ ఏమిటీ పరీక్ష. నీతి, న్యాయం అంటు బ్రతకాలంటే సాధ్యమా? ఈ ఆర్థిక సమస్యల సుడి గుండంలోంచి బయటపడ్డం సాధ్యమా? మెదడు నరాలు చిట్లిపోతున్నాయనిపించింది.

తల్లికి డబ్బు పంపించాలి; పిల్లల ఫీజు కట్టాలి; కిరాణా కొట్టు పద్దు కట్టాలి; తాకట్టు పెట్టిన నగ విడిపించుకోవాలి; మళ్లీ యధావిధిగా ఇల్లు గడవాలి.

ఇవన్ని సాధ్యమా? నీతికి గుర్తింపేది? ప్రతి విషయాన్ని నైతికంగా ఆలోచించే బదులు, మారుతున్న కాలానికి అనుగుణంగా తను మారితే-? కాని తండ్రి ఆశయం, క్రమశిక్షణ మట్టిపాలయినట్టే. మరి ఎలా?

ఆ రాత్రి పెద్దవాళ్లిద్దరు పస్తే! పొద్దున మిగిలినది పిల్లలిద్దరికీ చాలలేదు. వాళ్ల పరిస్థితికి పరిహసిస్తున్నట్టు కిటికీ రెక్క గాలికి కొట్టుకుంది. ఓ క్షణం కిటికీ వేపు చూసి కృంగిపోయాడు.

* * * * *

నిన్న పొరపాటున తల్లి వ్రాసిన ఉత్తరం ఫైల్లో మరిచిపోయిన సంగతి బీరువా తీసాక గాని గుర్తుకు రాలేదు. నిన్నటి ఫైలు అందుకుని ఉత్తరం తీసాడు.

ఆశ్చర్యం! ఉత్తరంలో మడిచిపెట్టిన వంద రూపాయల నోట్లు అయిదు వున్నాయి నిన్న తను పెట్టినపుడు లేవు. ఈ రోజు అందులోకి ఎలా వచ్చాయి? ఆలోచించి చివరకు బీరువాను నిశితంగా పరిశీలించాడు. మారు తాళాలతో బీరువాను తెరిచి అందులోని ఫైళ్లను కదిపినట్టుగా వున్నాయి. ఫైళ్ళు ఏమైన పోయాయా అని జాగ్రత్తగ చూసాడు. కాని అన్ని సరిగ్గావున్నాయి.

ఫైళ్లు కదిలించకుండా, అందులో డబ్బు పెట్టింది ఎవరు? తను యిప్పుడేం చేయాలి?

డబ్బు కంటబడగానే సమస్యలన్నీ కళ్ల ముందు మెదిలాయి. చాలా సేపు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఉత్తరం, ఫైలు, పట్టుకుని తన ఆఫీసరు గదిలోకి నడిచాడు. అక్కడ మరో ఇద్దరు వ్యక్తులు కొత్తవాళ్ళు కూర్చుని ఏదో మాట్లాడుతున్నారు. ఒక్క క్షణం నిలబడి మెల్లిగా దగ్గాడు మూర్తి.

అలికిడి గమనించిన ఆఫీసరు మూర్తిని దగ్గరకు పిలిచాడు.

"ఏమిటి?" ప్రశ్నించాడు.

మూర్తి ఉత్తరంలోని డబ్బుని టేబుల్పై పెట్టి, పరిస్థితిని, ఆ డబ్బు ఎలా వచ్చింది తనకు అర్థం కావడంలేదని తనేం చేయాలని పూర్తిగా వివరించాడు. విషయాన్ని గురించి ఆఫీసరు చాలాసేపు మౌనంగా వుండి -

"చూడు మిస్టర్ మూర్తి! నీ మంచితనం నాకు తెలుసు. నీవెంతటి నిజాయితిపరుడవో, కార్యదీక్షత కలవాడివో నాకు తెలుసు. నీలాంటి వాళ్ళు నేటి కాలంలో చాలా అరుదు. అయినా నీవు చెప్పన్న విషయం నమ్మశక్యంగా లేదు. బహుశా నీవే డబ్బు అందులో పెట్టి మరిచిపోయి వుంటావు. మరోసారి ఆలోచించు ..." ఆగాడుపై అధికారి.

"నో సర్! ఇంపాజిబుల్! నేను మరిచిపోవడం జరిగని పని. అయినా నెలాఖరు యింత డబ్బు నా వద్ద ఎక్కడిది సార్! అది ఎలా వచ్చిందో, ఎవరిదో నా కవసరంలేదు. నాకొచ్చే జీతం సరిపోకపోతే ఒక్క పూట పస్తుంటాను తప్పితే, తేరగా వచ్చే డబ్బును నా జన్మలో ఆశించను. అవినీతి అనేది నా బద్ధశత్రువు సర్!" రుద్ధమైన కంఠంతో గంభీరంగా చెప్పాడు.

అప్పటి వరకు శ్రోతలుగా ఉన్న కొత్త వ్యక్తులిద్దరూ లేచి "వెల్ మై డియర్ బోయ్! నీయొక్క నిజాయితీకి మా జోహార్లు. నీతి అనేది నీ నరనరాల్లో జీర్ణించుకు పోయింది. ఇంతకు మేమెవరో చెప్పలేదు కదు. మేము అవినీతి నిరోధక శాఖకు చెందిన ప్రత్యేకాధికారులము. మా శాఖలో బర్తీ కోసం నిజాయితీ కల వ్యక్తులను వేటాడుతున్నాం.

నీ కాన్ఫిడెన్షియల్ రిపోర్టు చూసి, నీ ఆర్థిక పరిస్థితిని గమనించి నిన్ను రహస్యంగా వెంటాడి, నీ ఇంటి పరిస్థితులు, డబ్బు యొక్క అవసరం చూసి, డబ్బు అందులో పెట్టాము. అయినా నీవాశించలేదు. నీలాంటి వ్యక్తులు మా ఎ. సి. బి కి అత్యవసరం. నిన్ను మా శాఖలో అధికారిగా నియమిస్తున్నాము. నీకు అన్ని ఆర్డర్లు త్వరలో అందుతాయి." మూర్తితో కరచాలనం చేస్తూ చెప్పారిద్దరూ.

కలా? నిజమా? ఆశ్చర్యంతో, ఆనందం మునిగిపోయాడు మూర్తి తమ ఆఫీసరు కూడా చేయి కలపడంతో ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

నీతి! నీకింకా గుర్తింపు వుంది. అనుకున్నాడు మూర్తి!

అతని మనస్సు ఆనందంతో ఉరకలు వేసింది. □

మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం


SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.
హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.
LINTAS RIN 99 2720 TL

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



డి. డి. వి. ప్రసాదరావు, నూజివీడు

సినిమాలలో మంగళసూత్రాన్ని వృధాగా వాడటం వలన ..., నిజజీవితంలో స్త్రీ మాంగల్యాన్ని అవమాన పరుస్తున్నారంటాను. మీరేమంటారు?

నిజ జీవితాల్లోని కొన్ని సంఘటనలే సినిమాలు అయినప్పుడు, సినిమాల్లో స్త్రీ మాంగల్యాన్ని కించపరుస్తున్నారని అనుకోవడం అసంబద్ధం అవుతుంది. భర్తే దైవమని ... తన మంగళసూత్రం కలకాలం నిలవాలని ఎన్నో చిత్రాల్లో ఎన్నో పాత్రల ద్వారా ఎంతో పవిత్రంగా సినిమాల్లో చూపుతున్న సంగతిని మర్చిపోకూడదు.

కె. సోమిరెడ్డి, మచిలీపట్నం

ఎంతో మంది నటీనటులు మనకున్నా మనవారికి అవకాశాలు యివ్వకుండా పరభాషల వారికి అవకాశాలు యిస్తూ నిర్మాతలు చిత్రాలు ఎందుకు నిర్మిస్తున్నారు?

కళకు భాషాభేదం లేదు. పాత్రల్ని బట్టి నటీనటుల ఎంపిక జరుగుతుంది. అంతేకాని మన వాళ్ళకే యివ్వాలి. ఇతర భాషల వాళ్ళకి ఎందుకు అవకాశాలు యివ్వాలన్నది కాదు.

సి. గణపతిరెడ్డి, తిరుపతి

మీరు విప్లవాత్మక చిత్రాల్లో నటిస్తే చూడాలని ఉంది?

'నేటి భారతం'లో భారతిని చూడలేదా? 'ప్రతిఘటన'లో ఝాన్సిని మర్చిపోయారా? 'అరుణకిరణం'లో డా. అరుణను మర్చిపోయారా? 'రేపటి పౌరులు'లో సరస్వతి.... యివన్నీ నేటి సమాజంలోని పాత్రలుకావా? ప్రతిఘటించే పాత్రలు కావా?

పి. శ్రీరామచంద్రమూర్తి, గుంటూరు

భవిష్యత్‌లో మీరు నిర్మాతగా కాని, దర్శకత్వం గాని చేసే ఉద్దేశ్యం ఏమైనా ఉందా?

ఇంతవరకూ లేదు.... బహుశా రాదు కూడా! ఒకవేళ అలాంటి ఆలోచన కల్గితే మీకు ముందుగా తెలిపి చేస్తాను.

## ఉత్తమ ప్రశ్న

వై. తిరుమలాదేవి, ఒంగోలు

ప్రతి స్త్రీ తన చదువును ఇతరుల స్వార్థానికి బలిచేయకుండా సద్వినియోగ పర్చుకుని ప్రజా సేవకై వినియోగించాలని "అరుణకిరణం"లో మీ పాత్ర ద్వారా చాలా బాగా చెప్పారు. అరుణ పాత్రలో మీరు నటించలేదు. జీవించారు అంటాను. నామాట కరక్టేనంటారా?

ఎన్నో చిత్రాల్లో నటించుతుంటాము. మరెన్నో పాత్రల్ని పోషిస్తుంటాము. కానీ కొన్ని పాత్రలే జీవితంలో మిగుల్తుంటాయి. అలాంటి పాత్రల్లో ఒకటైన మీరు మెచ్చిన డా. అరుణ పాత్రను ఎప్పటికీ మర్చిపోలేను.

సి. అనూరాధ, కొల్హాపూర్

డాక్టర్స్ వుండి కూడా ప్రజలకు ఉచితంగా వైద్యం చేయడం లేదు. మీరు నిజంగా డాక్టర్ అయితే ప్రజలకు ఉచితంగా వైద్యం చేసే వారేనా?

చాలా చక్కని ప్రశ్న వేసారు. ఉచిత వైద్యశాలలు అనే పేరుతో ఉండి కూడా ఎవరూ ఉచితంగా వైద్యం చేయడం లేదని అన్నారు. కోటికో.... నూటికో ఒకరుంటారు. పేదల్ని ఆదుకోవడానిక్కి, వారి బాధల్ని, రోగాల్ని తీర్చడానికి. నిజంగానే నేను డాక్టర్ని అయితే ఆ కోటిలో నో, నూటిలో నో ఒకర్ని అయిఉండేదాన్ని.

యం. యస్. బాలసుబ్రహ్మణ్యం, విజయవాడ

సినిమా నటీనటులకు డబ్బు ఉంటుంది ... కానీ, మనశ్శాంతి ఉండదు అంటారు. ఇది నిజమా?

ఇలా అనుకోవడం భ్రమే అవుతుంది.

కె. సాయిశ్రీనివాస్, తెనాలి

మీ గురించి ... మీ విజయాల్ని గురించి పొగిడితే సాధారణంగా కృతజ్ఞతలు తెల్పుతారు. ఇదే మిమ్మల్ని ... మీ నటనను విమర్శిస్తే తట్టుకుంటారా?

తప్పకుండా!

నేను నటించిన చిత్రంలోని పాత్ర మంచి చెడుల గురించి విమర్శిస్తే అది నిజంగా సద్విమర్శే అయితే తప్పక ఆ విమర్శను తీసుకుంటాను.

వై. పి. సునీత, సికింద్రాబాద్

భార్యాభర్తలిద్దరూ ఉద్యోగం చేస్తే మంచిదని నేనంటాను. మరి మీ అభిప్రాయం?

మీది చక్కని అభిప్రాయం. నేటి జీవన విధానంలో దంపతులిరువురూ ఉద్యోగాలు చేయడం వల్ల వారి జీవితాలు సుఖమయం అవుతాయి.

భానుమతి, మద్రాసు

ఈ విజ్ఞానయుగంలో సినిమాలలో నటించే స్త్రీలకు ఎట్లాంటి స్థానం వుందంటారు?

చాలా చక్కని స్థానం వుందనే నా నమ్మకం. ■

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

పంపిన వారి పేరు : ______________________________

పూర్తి చిరునామా : ______________________________

# అభిమాన తారలపై అభిప్రాయం

నటశేఖర కృష్ణగారు అంటే నాకెంతో అభిమానము. స్వతహాగా చాలా మంచివారు, మంచి వ్యక్తిత్వం కల మహా మనిషి. నిస్వార్థపరుడు, త్యాగధనుడు, ధైర్యశాలి, అందాల చంద్రుడు. అభిమానుల ఆరాధ్య దైవము, ప్రభుత్వానికి, నిర్మాతలకు, సినీ ఎగ్జిబిటర్లకు "కల్పవృక్షము" లాంటి వ్యక్తి. పేదలపాలిటి పెన్నిధి, ఆపద్బాంధవుడు,



గుణవంతుడు. హరిజన గిరిజన, అట్టడుగు, బడుగు వర్గాల ప్రజల గురించి నిరంతరము ఆలోచించే వ్యక్తి. ఎన్నో కుటుంబాలకు ఉపాధి కల్పించిన వ్యక్తి. ఎన్నోసార్లు వరద బాధితులను ఆదుకున్న మంచి వ్యక్తి. వారి సువర్ణ హస్తముతో ఎన్నో దాన ధర్మాలు చేసి, మంచిపేరు తెచ్చుకున్న వ్యక్తి. అందుకే నేను కృష్ణగారిని అభిమానిస్తాను, ఆరాధిస్తాను.

-మహమ్మద్ రఫీ, కొమెరపూడి

★ ★ ★

నా అభిమాన నటి విజయశాంతి "ఊరికి సోగ్గాడు" "ప్రతిఘటన", "శ్రావణ సంధ్య", "ముద్దుల క్రిష్ణయ్య" సినిమాలు చూశాక నేను ఆమె అభిమానినయ్యాను.

"బ్యూటీ క్వీన్" విజయశాంతి నటన అద్భుతం, అతి సహజం. ఆమె డ్యాన్స్ చేయటంలో, డైలాగ్స్ చెప్పటంలో, స్టెప్స్ వేయటంలో అద్భుతంగా ఈజీగా నటిస్తారు.

గతంలో ఎన్నో చిత్రాలలో అద్భుతంగా నటించి తనకు తానే సాటి అనిపించుకున్న విజయశాంతి



యికమీదట కూడా "అరుణ కిరణం". "సమాజంలో స్త్రీ", "వందేమాతరం" లాంటి మంచి చిత్రాలలో, మంచి కథా బలం గల చిత్రాలలో నటించి అభిమానులను, ప్రేక్షకులను ఆనందపరచ కోరుచున్నాను.

-యస్. కె. మిర్జాన్, గోపాలపురం (ప. గో. జిల్లా)

హిమాలయాల శిఖరాగ్ర భాగాన్నుంచి జాలు వారే ఆ జలపాతాల వేగాన్ని తన ప్రతి అణువణువునా సంతరించుకొని, నదీ ప్రవాహ సోయగాలను సొంతం చేసుకొని, చలన చిత్ర పరిశ్రమ అన్న మహాసముద్రము నుండి పెనుతుఫానులా ఉద్భవించి, ఆ తుఫాను కన్నా వేగంగా 6 కోట్ల ఆంధ్ర జనావళి ప్రేమాభిమానములను అంతే వేగంతో అందుకోగలిగిన ఆ డైనమిక్ హీరో చిరంజీవియే నా అభిమాన ఉజ్వల తార. చిరంజీవి ప్రతిభ ఏ ఒక్క విషయంలో మాత్రమే కాక, అన్ని విషయాలలోను చూపింపబడినది.

చిరంజీవి వైవిధ్యాన్ని సంతరించుకొన్నట్టి పాత్రలు పోషించినప్పటికీ, ఒకే మూసలో అతని పాత్రల స్వభావాలు ఉన్నాయన్న విమర్శ ఉంది. దానికి కారణం ఈ మధ్య అతని సినిమాలలోని పాత్రలే అని చెప్పక తప్పదు. 1983 సం.లో 'ఖైదీ' చిత్రము విడుదలైన తదుపరి ఒక్క విజేత, "చిరంజీవి" చిత్రాలలో తప్ప 'చిరంజీవి'లో వైవిధ్యాన్ని మనం చూడలేదు. కాని చిరంజీవి 1985 సం. తరువాత మంచి నిర్ణయాన్ని తీసుకొన్నాడని చెప్పక తప్పదు. ఎందుకంటే 1986 సం.లో అతను



అంగీకరించిన చిత్రాలు అన్నీ వైవిధ్యపూరితమైనవే. 'చంటబ్బాయి' చిత్రంతో హాస్యరసాన్ని, 'ఆరాధన' చిత్రంలో భారతీరాజా ఊహల నుండి ఉద్భవించిన మహానటులకు సైతం నటన నేర్పే నటరాజుగా, విశ్వనాధ్ చిత్రంలో విశ్వనాధ్ మలచిన శిల్పంలా, బాలచందర్ ంతో బాలచందర్ టైపులో భాసించే తారలా, కోదండరామిరెడ్డి, రాఘవేంద్రరావుల కమర్షియల్ టైపులో ఎదురులేని హీరోగా, కొదమ సింహంలా వెండి తెరపై వికసించడానికి సిద్ధమౌతున్నాడు కాబట్టి 1986 చిరంజీవికి, అభిమానులకు, శ్రేయోభిలాషులకు, అఖిలాంధ్ర ప్రజానీకానికి, సినిమా పరిశ్రమకు సంబంధించిన వారికి అందరికి సువర్ణ సంవత్సరం కాగలదు.

-పి. రవికుమార్, గూడూరు

★ ★ ★

నేడు సినీపరిశ్రమలో వెలుగొందు నటులలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానం ఏర్పరుచుకొన్నవారు శ్రీ శోభన్‌బాబు అని చెప్పవచ్చు. శ్రీ శోభన్‌బాబు నటించిన చిత్రాలు భారీ పబ్లిసిటీగాని, స్టంట్సుగాని లేకుండగనే అత్యద్భుతంగా విజయాన్ని సాధిస్తాయి. వ్యక్తిగతంగాను, పరిశ్రమకు సంబంధించిన విషయంలోను మంచి మనిషి అనిపించుకున్న నటుడు శ్రీ శోభన్. అంతేకాకుండా పత్రికలలో తాను యిచ్చే స్టేట్‌మెంటులకు కట్టుబడి ఉండే ఉన్నత వ్యక్తి. ఇక నటన, పాత్రల విషయానికొస్తే తన పాత్రకు న్యాయాన్ని చేకూర్చడంలో ఎంతో శ్రద్ధ కనుబరుస్తారు. కుటుంబ కథా చిత్రాలలోనే కాక



వెరైటీ పాత్రలు కూడ వేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. శ్రీ శోభన్ సమర్పణలో కళాత్మక చిత్రాలు రావాలని నా ఆకాంక్ష.

—బి. వి. గమణయ్య, బుడమగుంట

★ ★ ★

నేడు ఆరుకోట్ల తెలుగు ప్రజల అందాల యువనటుడు నందమూరి బాలక్రిష్ణ.

చిత్రపరిశ్రమలో సాంఘికాలే గాక, పౌరాణికాలు కూడా అవలీలగా పోషించి తనకంటూ ఒకప్రత్యేక స్థానం ఏర్పరుచుకున్న బాలక్రిష్ణ అంటే నాకెంతో యిష్టం. దానవీర శూర కర్ణలో "అభిమన్యుడుగా", పట్టాభిషేకంలో "శ్రీకృష్ణునిగా", దేశోద్ధారకుడులో "సుయోధనుడు", "శివాజిగా" నటించి తండ్రికి తగ్గ తనయుడుగా పేరుపొంది, తనకు తానే సాటి అని నిరూపించుకున్న నందమూరి బాలక్రిష్ణ తెలుగు సినీ జగత్తు గర్వించదగ్గ యువనటుడు అనుటలో అతిశయోక్తి లేదు.



బాలక్రిష్ణగారు విమర్శలను, అపజయాలను చిఱునవ్వుతో స్వీకరించి, రికార్డులు, అవార్డులు సాధించి తెలుగు చిత్రసీమలో ధృవతారగా నిలవాలని నా కోరిక.

—పి. పుల్లారెడ్డి, చెన్నుగారిపల్లి పాకాల



"తేనె మనసులు"లో కృష్ణ, జయప్రద

# సినిమా



## కృష్ణ "జమదగ్ని"గా భారతీరాజా దర్శకత్వంలో

"దుష్టశక్తులకు పక్కలో బల్లెంగా ఉంటూ. నిజాన్ని నిర్భయంగా ప్రజలకు అందించే పాత్రికేయులే దేశాభ్యున్నతికి ఎంతైనా తోడ్పడతారు. ఇలాంటి పవర్‌ఫుల్ పాత్రను కృష్ణ ధరించడం ఇదే ప్రథమం. ఆయన ఎంత మహోన్నతమైన నటుడో, అంత సహృదయుడు కూడా. ఆగస్టు షెడ్యూల్‌ను మద్రాసులో జరిపాం. సెప్టెంబర్ 1 నుంచి 10 వరకు బెంగుళూరు చుట్టు ప్రక్కల జరుగుతుంది. అక్టోబర్‌లో మూడవ షెడ్యూల్ కాశ్మీర్‌లో జరుగుతుంది." అన్నారు భారతీరాజా. ఈయన దర్శకత్వంలో చుక్కపల్లి వేణుబాబు, జి. నీలకంఠారెడ్డి నిర్మిస్తున్న పవన్ ప్రొడక్షన్స్ వారి "జమదగ్ని" చిత్రంలో రాధ నాయిక. సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, పి. ఎల్. నారాయణ, సుదర్శన్, సుమలత తదితరు నటవర్గం. సెల్వరాజ్ కథకు సత్యానంద్ సంభాషణలకర్త. ఇళయరాజా సంగీతం, కమల్‌శేఖర్ శిల్పం, తార నృత్యాలు, చిత్రా లక్ష్మణ్– జి. శ్రీనివాసరావు సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

## సెప్టెంబర్ 25న దాసరి, కృష్ణంరాజుల "తాండ్ర పాపారాయుడు"

తెలుగు చలన చిత్రసీమలో ఇంతవరకు కనీ వినీ ఎరుగనంత మహోన్నతంగా దాదాపు కోటి రూపాయల వ్యయంతో దాసరి నారాయణరావు దర్శకత్వంలో యు. వి. సూర్యనారాయణరాజు నిర్మించిన గోపీకృష్ణా మూవీస్ "తాండ్రపాపారాయుడు" చరిత్ర సృష్టించే చిత్రం సెప్టెంబర్ 25న విడుదలవుతోంది. ప్రధాన పాత్రధారిగా కృష్ణంరాజు అపూర్వంగా, విజయరామరాజుగా మోహన్‌బాబు అద్వితీయంగా, బుస్సీగా ప్రాణ్ మహోన్నతంగా, మల్హంగప్పరాయుడుగా గుమ్మడి, చంద్రశేఖరరాయుడుగా జె. వి. సోమయాజులు, హైదర్‌జంగ్‌గా కోట శ్రీనివాసరావు,

# విశేషాలు

-జి.వి.జి.

జగ్గారావు, ఫ్రెంచ్ సేనాని 'లా'గా టెలిఫోన్ సత్యనారాయణ, రాజపురోహితుడుగా మల్లాది. జ్యోతిర్మయిగా జయప్రద, చిన్నమ్మగా సుమలత. భ్రమరాంబికాదేవిగా అంజలీదేవి, భార్గవిగా సూర్యకాంతం, నిర్మలాంబికగా నిర్మల, విమలాంబికగా షహిదా, నర్తకీమణులుగా జయమాలిని, జ్యోతిలక్ష్మి, స్మిత, అనూరాధ, విశిష్టమైన మల్లమ్మ పాత్రలో జయసుధ



ంగ మొగుడు"లో చిరంజీవి, భానుప్రియ

విరూపాక్షరాయుడుగా కాంతారావు, విజయనగర పురోహితుడుగా అల్లు రామలింగయ్య, రాయుడప్ప రంగారాయుడుగా మిక్కిలినేని, దూబాసి లక్ష్మన్నగా సారథి, విజయనగర మంత్రి బుర్రబుచ్చన్నగా ధూళిపాళ, ఆస్థాన విదూషకులు మంగళం-సర్వమంగళంలుగా నాగేష్, వేలు, హాసనాళిగా ఆనందమోహన్, విజయనగర సేనాధిపతిగా నటించారు. కొండవీటి వేంకటకవి సంభాషణలకర్త. యామినీ సరస్వతి, ఒ. ఎస్. ఆర్. ఆంజనేయులు రచనా సహకారం అందజేశారు. సి. నారాయణరెడ్డి, కొసరాజు గీతాలకు ఎస్. రాజేశ్వరరావు స్వరకర్త. పి.ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, పసుమర్తి కృష్ణమూర్తి-తార నృత్యాలు, యమ్మనూరు ప్రభాకర్ సంయుక్త దర్శకత్వం. డి. వెంకటరత్నం కూర్పు, జి. న. త్రి రాజు నిర్వహణతో కృష్ణంరాజు సమర్పణ.

## నందకుమార్ దర్శకత్వంలో నరసింహారావు నిర్మించే "నల్లత్రాచు"

"అండమాన్ దీవుల నుంచి దాదాపు ముప్ఫైవేలు ఖర్చు పెట్టి తెప్పించిన 17 అడుగుల నల్లత్రాచుతో చాలా జాగ్రత్తగా షూట్ చేయవలసి వచ్చింది. ఇది ఎప్పుడూ బుసలు కొడుతూ రోషంగా ఉండాలి గనుక కోరలు తొలగించలేదు. అంచేత, ఆంటీ వెనమ్ ఔషధంతో ఒక డాక్టర్ సదా షూటింగ్ స్పాట్‌లో ఉండవలసి వచ్చింది. మౌంట్‌రోడ్, అశోక్‌నగర్, రోడ్లలో వాహనాల ఛేజింగ్‌ను చాలా థ్రిల్లింగ్‌గా తీశాం. ఇలాంటి గగుర్పాటు కలిగించే సన్నివేశాలు పుష్కలంగా ఉన్నాయి మా చిత్రంలో," అన్నారు పద్మజా పిక్చర్స్ సి. హెచ్. నరసింహారావు. ఈయన ఎం. నందకుమార్ దర్శకత్వంలో నిర్మించిన పై చిత్రంలో చిత్ర, వినోద్, జెనర్జి, శివప్రసాద్, కాకరాల, థమ్, శ్యామలరావు, మాస్టర్ రాజేష్, వై. విజయ, అనూరాధ, బిందుఘోష్, సత్యకళ, జయలలిత, శ్రీ లక్ష్మి నటించారు. ఆకెళ్ళ మాటలు, సీతారామశాస్త్రి పాటలు, రాజ్-కోటి సంగీతం, దివాకర్ ఛాయ, సూర్యకుమార్ శిల్పం, శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు, ఆర్. తరణిరావు సంయుక్త దర్శకత్వం, బాలు కూర్పు నిర్వహిస్తున్నారు. సింగపూర్ నుండి ప్రత్యేకంగా తెప్పించిన డిస్కో లైట్లతో మోహన్‌కుమార్ నృత్యం ఈ చిత్రంలో అదనపు ఆకర్షణ. సెప్టెంబర్ విడుదల.

"తాత మనవళ్ళు"లో అమల



# సినిమా

## తొలి తెలుగు వీడియో చిత్రం 'గ్రామబలి'

మన రాష్ట్రంలో నిర్మించిన తొలి తెలుగు వీడియో చిత్రము "గ్రామబలి". ఆర్. డి. కంబైన్స్‌వారు నిర్మించిన యీ చిత్రం విజయవాడ తాలూకా పాతపాడు, మంగళాపురంలలో పూర్తి అవుట్ డోర్‌లో చిత్రీకరించారు.

బలి అనే మూఢ నమ్మకంతో ఆ గ్రామప్రజలను తప్పు దోవ పట్టిస్తున్న ఆ గ్రామ పెద్దల అరాచకాలను బయటపెట్టే ఇతివృత్తంగల, మన రాష్ట్రంలో తొలిసారిగా ఒక కథా వస్తువును వీడియో చిత్రంగా నిర్మించిన ఈ చిత్రంలో నాలుగు పాటలు ఉన్నాయి.

అక్టోబర్ 2న గాంధి జయంతినాడు అన్ని వీడియో క్యాసెట్టు సెంటర్సుకు విడుదల చేయబడుతున్నవి. ఈ చిత్రంలో శశికిరణ్, సతీష్‌బాబు, జైహింద్, కమల్‌కుమార్, పి. కృష్ణ, రాజా, బి. శంకరరావు, అరుణ్‌కుమార్, మినాకుమార్, శ్రీకన్య, శిరిషా, జ్యోతి మరియు షెటీనా నాగేశ్వరరావు నటించారు.

ఈ చిత్రానికి కథ ఆర్. డి. కంబైన్స్, పాటలు డా. కె. భాస్వంతరావు, సంగాల ధర్మారావు, సంగీతం: ప్రేమ్‌జీ, కెమెరా: బుర్జియ్య, ఎం. మధుసూదనరావు, ఎడిటింగ్: కిషోర్, డాన్స్: కె. ఎన్. బలం, ఫైట్స్:కరాటే సాయి, ఆర్ట్: రమణ, నిర్మాణ నిర్వహణ : దాసరి ధర్మారావు, నిర్మాతలు: బి. టి. రావు, జి. టి. రావు, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: టి. కనకదుర్గారావు.



"శాంతి నివాసం"లో సుహాసిని, రాధిక

ఇదే సంస్థ తమ ద్వితీయ వీడియో చిత్రాన్ని "భావి పౌరులు" పేరుతో నిర్మిస్తున్నారు.

ఈ చిత్రం నవంబరు 14న నెహ్రూ జన్మదినాన విజయవాడలో ప్రారంభం కానున్నది. పిల్లలపై ప్రధానంగా నిర్మించుచున్న యీ చిత్రంలో విజయవాడ హైస్కూల్సు నుండి బాలబాలికలను ఎన్నుకొని చిత్ర నిర్మాణము చేయటం విశేషం.



"గ్రామబలి"లో శిరిష, సతీష్‌బాబు

ఇందులో "జానీ" అనే కుక్క, రాము అనే కోతి రెండు ముఖ్య పాత్రలు పోషించడం విశేషం.

ఈ చిత్రానికి కూడా "గ్రామబలి" చిత్ర యూనిట్ పనిచేస్తుందని "భావి పౌరులు" వీడియో చిత్రాన్ని 1987 జనవరి 26 రిపబ్లిక్‌డేనాడు విడుదల చేస్తామని చిత్ర నిర్మాతలు తెలియజే  _న్నారు.

## సురేష్ ప్రొడక్షన్స్‌లో బాలకృష్ణ

"మా సంస్థలో చాలా చిత్రాలకు సహకార దర్శకుడిగా అనుభవం గడించిన నాగేశ్వరరావుని డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాను. వచ్చే జనవరిలో షూటింగ్. బాలకృష్ణ హీరో," అని తెలిపారు సురేష్ ప్రొడక్షన్స్ అధినేత డి. రామానాయుడు. □

మొహానికి కాస్త పౌడర్ ఎక్కువయినట్టుంది, చూసుకున్నావా?



శ్రీ సారసా మూవీస్

# ఒక రాధ ఇద్దరు కృష్ణులు

ఎ.కోదండరామిరెడ్డి

ఇళయరాజా యండమూరి సత్యానంద్ లోక్‌సింగ్

శ్రీనివాసరాజు · డి.వెంకటరత్నం · పి.శరత్




• నైజాం: దిగ్విజయా ఫిలింస్, సికిందరాబాద్; • సీడెడ్: భాస్కర్ పిక్చర్స్; చిత్తూరు; • నెల్లూరు: మహాలక్ష్మి ఫిలింస్, నెల్లూరు;
• గుంటూరు: గీతా ఫిలింస్, గుంటూరు; • వెస్టు: ఉషా పిక్చర్సు; ఏలూరు; • వైజాగ్-శ్రీకాకుళం: విజయలక్ష్మి ఫిలింస్, వైజాగ్;



# సర్వజనరంజకమైన సంగీతాన్నిచ్చే సత్యం

షర్టుతో పాటు కూలింగ్ గ్లాసెను కూడా పాంట్‌లో దోపి, కాలుతూన్న సిగరెట్‌ను వేళ్ళ మధ్య ఇమిడ్చి, రికార్డింగ్ హాలంతా తిరుగుతూ, వాద్య నిపుణులకు ఎవరికే సలహాలివ్వాలో ఇచ్చాక, సౌండ్ రికార్డిస్ట్ పక్కన వచ్చి కూర్చున్నారు ఓ వ్యక్తి.

ఆయన ఎత్తులో కాస్త పొట్టే అయినా-సంగీతపు సత్తువలో గట్టే... అందర్నీ అలరించే సంగీత మివ్వడంలో దిట్టే.

ఆయనే సంగీత దర్శకుడు చళ్ళపిళ్ళ సత్యం.

"ఇంత వరకు ఎన్ని చిత్రాలకు సంగీతమిచ్చి ఉంటారు, సత్యంగారూ?" అనడిగాను.

"ఒక హిందీ, ఒక మలయాళం, రెండు తమిళం, తెలుగు కన్నడ భాషల్లో దాదాపు అయిదు వందల చిత్రాలకు మ్యూజిక్ ఇచ్చి ఉంటాను. తమాషా ఏమిటంటే- నేను మ్యూజిక్ ఇచ్చిన చిత్రాల రికార్డులు కాని, కేసెట్టుగాని నా వద్ద మచ్చుకి ఒక్కటైనా లేదు. ఎప్పుడైనా రేడియోలో పాట వింటూంటే, 'ఓహో! ఇది నేను ట్యూన్ చేసిన పాట కదా' అనిపిస్తూంటుంది... ఒక విషయం మాత్రం చెప్పి తీరాలి. 30 ఏళ్ళ క్రితం చిత్రాలలోని పాటలు ఇప్పటికీ కొందరి చెవుల్లో మార్మోగుతూంటాయి. కాని, ఇప్పటి వడివడి ఉరుకుల కొట్టుడు సంగీతం మాత్రం అట్టే కాలం మనసుల్లో నిలవదన్నది మాత్రం సత్యం," అన్నారు సత్యం.

ఈయన స్వస్థలం పార్వతీపురంలోని గుణానుపురం అగ్రహారం. తండ్రి చళ్ళపిళ్ళ అప్పల నరసింహులుగారు.

సత్యానికి అయిదవ తరగతి తర్వాత చదువు మీద ధ్యాస తగ్గి, సంగీతం పట్ల పెరిగింది. సాలూరులోని సంగీత పాఠశాలలో సరిగమలు ప్రారంభించి, ఘటసాల మిత్రులైన సంగీతరావుగారి తండ్రి సీతారామశాస్త్రి పాత్రాయడుగారి వద్దా, ఈయన శిష్యులైన తంపెళ్ళ సత్యన్నారాయణగారి వద్దా సరళీ స్వరాలు, జంట స్వరాలు అవీ నేర్చుకుని కృతులూ, వర్ణాలూ బాగా సాధన చేశారు. ఊళ్ళోనే చిన్న చిన్న పాట కచ్చేరీలు చేస్తూ, మిత్రులను ఆనందపరిచేవారు. ఒకసారి కాకినాడ యంగ్‌మన్స్ హాపీ క్లబ్‌వారు ఏదో నాటకం ప్రదర్శించడానికి సాలూరు వచ్చినప్పుడు ఆ ట్రూప్‌తో వచ్చిన నేటి సుప్రసిద్ధ నిర్మాత, సంగీత దర్శకుడు శ్రీ ఆదినారాయణరావు, నటీమణి శ్రీమతి అంజలీదేవిగార్లు సత్యంగానం విని ముగ్ధులై, తమతో పాటు కాకినాడకు తీసుకెళ్ళారు. ఆ క్లబ్ నాటకాలలో చిన్న చిన్న వేషాలు వేస్తూ, యుద్ధ నిధి సేకరణార్థం వేసే నాటకాల ముందు ప్రార్థన గీతాలు పాడే వారు సత్యం. ఈయన విద్యాభ్యాసం పూర్తి చేయించాలని కాకినాడ పి. ఆర్. కాలేజ్ హైస్కూల్‌లో చేర్పించారు శ్రీ ఆదినారాయణరావు. థర్డ్‌ఫామ్ వరకు శ్రద్ధగా చదివారు సత్యం. ఇంతలో అంజలీదేవికి సినిమాలలో నటించే అవకాశం వచ్చింది. ఆమె, ఆదినారాయణరావుగార్లు మద్రాసు వెళ్ళిపోయాక ఆ గార్డియన్‌ల అండదండలు కరువయ్యేసరికి, సత్యం ఉత్సాహం మందగించి, స్వగ్రామం సాలూరుకు చేరుకున్నారు. అక్కడ గ్రామ మునసబు ఉద్యోగానికని పరీక్షలకు చదివారేగాని, స్వరరహితమైన ఆ నిస్సార వాతావరణమెందుకని ఉన్నట్టుండి మద్రాసుకు బయలుదేరారు. అది 1949 డిసెంబర్. అప్పుడు ఆదినారాయణరావు అశ్వనీ పిక్చర్స్ నెలకొల్పి, "మాయలమారి" చిత్ర నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారు.

"అసలు మొదట నేను పాటలు పాడాలనే ఉద్దేశ్యంతోనే మద్రాసులో అడుగు పెట్టాను. కాని, స్వర్గీయ ఘంటసాలగారి కంచు కంఠం విన్నాక-అంత మధురంగా నేను పాడలేను గనుక వేరే రూట్ చూసుకోవడం మంచిదనిపించింది," అన్నారు సత్యం.

ఈయన అశ్వనీ పిక్చర్స్ కార్యాలయంలోనే ఉంటూ, ఏం తోచనప్పుడు పెద్ద అంజయ్య అనే ఆయన వద్ద డోలక్ నేర్చుకుంటూండే వారు.

ఒక రోజు పెద్ద అంజయ్య రిహార్సల్స్‌కు రాలేకపోతే, సత్యం డోలక్ నేర్చుకున్నాడని తెలిసిన ఆదినారాయణరావుగారు "ఏదీ బజాయించు చూద్దాం" అన్నారు. దాంతో సత్యం పేరు 'డోలక్ సత్యం' అయిపోయింది.

ఆదినారాయణరావుగారికి అప్పుడు అసిస్టెంట్‌గా ఉన్న కీ. శే. టి. ఏ. రాజుగారికి ఎన్.ఎ.టి. సంస్థలో సంగీత దర్శకత్వం వహించే అవకాశం రాగానే సత్యాన్ని రిథమిస్ట్‌గా తీసుకున్నారు. ఆ తర్వాత "జయసింహ" చిత్రానికి సత్యం అసిస్టెంట్ మ్యూజిక్ డైరెక్టర్ అయ్యారు.

సత్యం సంగీత దర్శకుడయింది ఒక కన్నడ చిత్రం ద్వారా. అది ఎం. ఎస్ నాయక్ నిర్మించిన "శ్రీ రామాంజనేయ యుద్ధం". సంగీత దర్శకత్వం వహించిన తొలి తెలుగు చిత్రం ఎస్. భావనారాయణ 1968లో సమర్పించిన గౌరి ప్రొడక్షన్స్ "పాల మనసులు"

"రౌడీ రాణి"లాంటి డిష్యుం డిష్యుం చిత్రమైనా, "భక్త కన్నప్ప"లాంటి పౌరాణిక చిత్రమైనా, "అమరదీపం"లాంటి సాంఘిక చిత్రమైనా, "రాజయోగం"లాంటి జానపద చిత్రమైనా- ఒక పాటకు నాలుగు గంటలలోగానే సుమధురమైన బాణీని కూర్చగలరు సత్యం. ఈయన స్కూటర్‌లో వెళ్ళే రోజుల్లో ఒక సారి ఒక కొత్త ట్యూన్‌ని ఆలోచిస్తూ, ప్రమాదానికి లోనయ్యారు. గాయాలు పూర్తిగా మానక ముందే మళ్ళీ రికార్డింగ్‌లకు హాజరవటం మొదలెట్టారు. ఇంకో విశేషం ఏమిటంటే, ఒకసారి ఒక చిత్రం తాలూకు స్వప్న దృశ్యానికి జోడించవలసిన సంగీతం గురించి ఆలోచిస్తూ ఆలోచిస్తూ కునుకు తీశారు. అప్పుడాయనకు స్వప్నంలోనే ఆ ట్యూన్ స్ఫురించింది.

ఈయన అభిమాన హిందీ సంగీత దర్శకులు శంకర్-జైకిషన్, ఓ. పి. నయ్యార్, ఆర్. డీ. బర్మన్.

"నేను మ్యూజిక్ ఇచ్చిన రెండవ కన్నడ చిత్రంతో మహ్మద్ రఫీ పాడారు. ఇతర భాషా చిత్రాలలో పాడడానికి అంగీకరించని ఆశాభోంస్లే దాసరిగారు డైరెక్ట్ చేసిన 'పాలు-నీళ్ళు' చిత్రంలో నా స్వరకల్పనలో ఓ పాట పాడారు. ఇదంతా నా పూర్వజన్మ సుకృతమనుకుంటాను," అనే సత్యం సహృదయుడు, నిగర్వి, స్నేహశీలి. —(జి.వి.జి.)

# శ్వాసలో తాజాదనం కోసం లవంగం నమలడం సాంప్రదాయికంగా వస్తున్న ఆచారం



చైనా దేశంలో రాజ దర్బారులకు వెళ్లే ప్రజలు, అధికారులు, రాజ దర్శనానికి వెళ్లే ముందుగా, తమ శ్వాసలో తాజాదనము, సువాసన రావడానికని లవంగం నమిలేవారట. అదే లవంగం ప్రస్తుతం ప్రామిస్ టూత్‌పేస్టులో అత్యంత ప్రధానమైన దినుసు. ప్రామిస్‌తో పళ్లు తోముకున్నారంటే, చైనా రాజ దర్బారులకు వెళ్లే ప్రజలు, అధికారులకు లాగానే మీ శ్వాస కూడా తాజాదనము, సువాసన నిండి ఉంటుంది. ఇది లవంగ నూనె అద్భుత గుణమన్నమాట. ప్రామిస్‌లోని ప్రత్యేక ఫార్ములా కారణంగా ఇది. నోటిలోనూ శ్వాసలోనూ దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూల్చివేసి, మీ శ్వాసలో తాజాదనం నింపితెస్తుంది.

ఇంతేగాక, లవంగ నూనెలోని మరొక సుగుణమేమిటంటే, ఇది మీ పళ్లలో మూలమూలలా చేరి, మీ పళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవుల్ని తరిమికొట్టుంది. వీటిను నుండి విముక్తి పొందిన మీ పళ్లు ఆరోగ్యవంతంగానూ, దృఢంగానూ, మెరిసిపోతూనూ ఉంటాయి. మీ శ్వాసలో తాజాదనము, సువాసనా నిండిపోతాయి. అంటే ఇప్పుడు మీరు కూడా పూర్తి ఆత్మవిశ్వాసంతో ఏ రాజ దర్శనానికైై వెళ్లవచ్చు. ఏ రాణి దర్శనానికైనా వెళ్లవచ్చు!



లవంగ—
**ప్రామిస్** టూత్‌పేస్టులోని
అద్వితీయ పదార్థం



# Promise



లవంగ నూనెతో అద్భుత సృష్టి - ప్రామిస్ టూత్‌పేస్టు

3 బల్సారా—
టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA-B BLS 852 TEL

సీరియల్

# సంకెళ్ళెవరికి?

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

ఇంట్లో కూర్చుని బయట జరుగుతున్న సంభాషణలు విన్నది రూప. పరవా లేదు! ఇంత మందిలో కనీసం వొకడయినా సరయిన ధోరణిలో ఆలోచిస్తున్నాడు! సారంగపాణి హైస్కూలు చదువు చదువుకునేప్పటికే అతనికి తమ పరిస్థితి అర్థం అయింది ఇంకా ఎక్కువ మంది చదువుకుంటే? త్వరగా వీళ్ళంధరూ సభ్యసమాజంలో కలసిపోతారు!

సారంగపాణి మాటల్లో ఎంతో సత్యమున్నది ఇన్నాళ్ళూ చింటూని సంస్కరించి మామూలు దారికి తెచ్చి తీసుకుని వెళ్ళి అంకుల్‌కు అంటీకి చూపుదామనుకుంటున్నది. అతన్ని తాను మార్చగల్గినా వీళ్ళందర్నీ వదలి అతను తన వెంటరాడు అని అర్థమయింది రూపకు!

ఒక్కడూ మారడు. మారినా ప్రయోజనం లేదు! అతను వాళ్ళను వదలినా వాళ్ళతన్ని వొదలరు. సభ్యసమాజం అతన్ని నమ్మదు! అందరితో పాటు అతన్నీ మార్చాలి! వీళ్ళందర్నీ సమాజంలో కలపి వేయాలి! అప్పుడు గాని వాళ్ళకు మోక్షం కలుగదు! తన ఆశయం నెరవేరదు!

అందుకొకటే మార్గం! వీళ్ళందరకూ బయట ప్రపంచంలో జరుగుతున్న విషయాలు తెలియజేయాలి అప్పుడు గాని వీరిలో తాము ఎక్కడ వున్నామో ఎంత వెనుకబడి వున్నామో తెలిసిరాదు

ఇతరులతో పాటు తామూ ముందుకు వెళ్ళాలంటే తప్పుదారి వదలి వేయాలని అర్థం అవుతుంది వారికి. ఇవ్వాళ సారంగపాణి వొక్కడూ సరయిన పంథాలో ఆలోచిస్తున్నాడు! రేపు అతనికి తోడుగా మరికొంత మంది ముందుకు వస్తారు. మంచి కోసం వారి మనసులు ఆక్రోశిస్తాయి. క్రమేపి మంచి దారి తొక్కాలనుకునే వారి సంఖ్య పెరుగుతుంది! ఇన్నాళ్ళుగా అణగారిపోయిన మానవత్వం మేల్కొంటుంది! మేల్కొన్న మానవత్వం పుర వళ్ళు పరవళ్ళు తొక్కి అజ్ఞానాన్ని, పాశవికతను, దుర్మార్గాన్ని, దుష్టచింతనను పారద్రోలుతుంది!

అప్పుడు నిప్పులో శుద్ధి అయిన బంగారంలా చింటూ మంచివాడవుతాడు!

రూప ఆలోచనలకు అడ్డుకట్ట వేస్తూ "రాణీ! తయారుగా వుండు! ఇంకో గంటలో చెట్టియార్ ఇంటికి దోపిడికి వెళ్దాం" అంటూ అవతలకు వెళ్ళాడు చింటూ.

అతని వెంటే గదిలోకి వెళ్ళింది మణి! మరునిముషంలోనే బయట నుండి సుబ్రమణ్యం "రాణీ! చింటూని పిలూ" అంటే అతని గదిలోకి వెళ్ళింది రూప.

లోపలకు అడుగు పెడుతూనే విచలిత అయింది! చింటూ కౌగిలిలో గువ్వలా వొదిగిపోయి వున్నది మణి! ముందుకు వేసిన అడుగు వెనక్కు తీస్తూ

"చింటూ! తాత పిలుస్తున్నాడు" అని పిలిచింది. వెంటనే బయటకు వెళ్ళాడు చింటూ!

కాసేపట్లోనే తాత వొచ్చి "రాణీ నిన్ను కూడా తీసుకుని వెళతానంటున్నాడు చింటూ! నీకీ ప్రాంతం కొత్త! జాగ్రత్తగా వుండు" అన్నాడు.

"ఈ రాణీ శక్తి ఏమిటో తెలుసుకుంటావు తాతా!" అంటూ బయటకు వెళ్ళింది రూప!

వీళ్ళల్లో వున్నంత సేపు వాళ్ళలానే వుండాలి. రోములో వున్నప్పుడు రోమన్‌లా ప్రవర్తించమన్నారు. పోలీసాఫీసరుని అన్న విషయం మర్చిపోయి వాళ్ళల్లో వొకతెనని అనుకోవాలి! అలా కాకుండా వుండటానికి వీలులేదు! దోపిడి జరుగుతుందని తెలిసి వుండి డిపార్ట్‌మెంట్‌కు తెలియజేయకుండా ఎలా వుంటుంది? చెట్టియార్ ఇంట్లో దొంగతనం జరుగుతుందని డిపార్ట్‌మెంట్‌కు తెలియజేయటం తన విధి!

చింటూ వెంట చెట్టియార్ యింటికి దోపిడికి వెళ్ళడం తన కర్తవ్యం! విధి కర్తవ్యం పరస్పర విరుద్ధాలుగా వున్నాయి తన విషయంలో!

* * * *

సారంగపాణి దారి తీస్తుంటే చింటూ, అయ్యవ్వ, రంగ, రూప చెట్టియార్ ఇంటి వైపుగా బయల్దేరారు.

దారిలో పబ్లిక్ కాల్ ఆఫీసు కనపడితే "తమాషా చేస్తాను! చెట్టియార్ ఇంట్లో వున్నాడో లేదో తెలుసుకుందాం" అంటూ లోపలకు వెళ్ళి తలుపు వేసి పోలీస్ స్టేషన్‌కు డయల్ చేసింది రూప.

రెండు నిముషాలయాక నిద్రమత్తుతో తూగుతూ కానిస్టేబిల్ "టౌన్ పోలీస్ స్టేషన్ నుండి కానిస్టేబిల్ని మాట్లాడుతున్నాను" అన్నాడు.

"సరిగా విను! ఈ రాత్రి పూరి బయట చెట్టియార్ ఇంట్లో దోపిడి జరుగబోతుంది" అని కానిస్టేబిల్ "ఎవరు మాట్లాడుతుంది"? అని అదుర్దాగా అడుగుతుంటే ఫోను పెట్టేసి, బుక్ తీసి చూసి చెట్టియార్ ఇంటికి ఫోను చేసింది "సంపద చెట్టియార్ గారున్నారా"? అంటే "లేరు! సినిమాకు వెళ్ళారు" అని ఎవరో ఆడమనిషి సమాధానం చెప్పింది. "నువ్వు ఎవరు"? అంటే

"వంట మనిషిని" అని సమాధానం వచ్చింది. పబ్లిక్ కాల్ ఆఫీసు నుండి బయటకు వస్తూ "చెట్టియార్ ఇంట్లో లేడు సినిమాకు వెళ్ళాడట" అని చెప్పింది చింటూకు.

"మంచి శకునం" అంటూ బయల్దేరారు!

"రాణీ! ఆడదానివి! ఇలా దోపిడికి రావటానికి భయం వేయటంలా"? అన్నాడు రంగ

"నాకేం భయం? బాంకు దోపిడీలకు వెళ్ళాలన్నా, డెకాయిటీకు వెళ్ళాలన్నా నన్ను తీసికెళ్ళే వాడు టైగర్! మాట లెందుకు! రాణి సత్తా చూస్తారుగా"!

"మాట్లాడకండి! అదే చెట్టియార్ ఇల్లు" అన్నాడు సారంగపాణి!

ఎకరం పైచిలుకు స్థలంలో కట్టారు రెండంతస్థుల మేడ. చుట్టూ ప్రహరీపైన ముళ్ళతీగ! ఇనపగేటు ముందు నుల్చుని వున్నాడు గూర్ఖా.

"అదిగో టెలిఫోన్ తీగ! కత్తిరించండి" అన్నాడు చింటూ. రంగ టెలిఫోన్ స్తంభంపైకి బల్లిలా పాకు కుంటూ వెళ్ళి చెట్టియార్ ఇంటికి వెళ్ళే కనెక్షన్ కటింగ్

జరిగిన కథ-10: పోలీసులంతా వెళ్ళారని నిర్ధారణ చెసుకున్న తరువాత షెడ్‌లోకి వెళతాడు చింటూ. తండ్రి మరణానికి దుఃఖించి అతని శవాన్ని షెడ్‌లోనే పెట్టి తగలపెట్టేస్తాడు. చింటూ వెనకనే చమేలీ, రూప పొలాల మధ్యగా పోసాగారు. రూప కోసం తీవ్రంగా వెదకమని కాలిముత్తుతో చెప్తాడు తంగవేలు. చమేలీ, రూపలతో వేరే జిల్లాలో ఉన్న సుబ్రమణ్యం తాత దగ్గరకు చేరుతాడు చింటూ. కోటి చెట్టి ఇంట్లో దొంగతనం చేయాల్సిన బాధ్యతని చింటూకి అప్పగిస్తాడు సుబ్రమణ్యం తాత.

ప్లయర్సుతో కత్తిరించేసాడు

ముళ్ళతీగమీదకు గోతాం మడతలు పెట్టి విసిరాడు అయ్యప్ప సారంగపాణి భుజాల మీద నుండి గోతాం మీద కాలేసాడు చింటూ చింటూ చేయి ఆసరాయిస్తే రూప, రంగ, అయ్యప్ప లోపలకు దూకారు

అవ్ అవ్ అంటూ అరుచుకుంటూ వచ్చి దూకింది అల్సేషియన్ కుక్క వొడుపుగా పక్కకు తప్పుకుని కుక్క గోతాంలో పడేట్టు గోతాంమూతి తెరిచి వుంచాడు చింటూ అదాటుగా దూకిన కుక్క గోతాంలో పడిపోగానే గభాలున మూతి కట్టేసాడు వూపిరాడక కుయ్ కుయ్ మంటూ వుండిపోయింది అల్సేషియన్

కుక్క అరుపులు విన్న గూర్ఖా "టామీ! టామీ! అని అరిచి బదులు రాక పోయే సరికి పిల్లి కనపడితే అరిచి వుంటుంది" అనుకుని వూరుకున్నాడతను

రెండో అంతస్తు నుండి మురికి నీరు కిందకు వచ్చే గొట్టాంవుంది దాన్ని పట్టుకుని జరజరాపైకి పాకి వెళ్ళాడు చింటూ! అతని వెంటే వెళ్ళాడు రంగ

రూప, అయ్యప్ప కిందవుండ పోయారు చింటూ పోర్టికో గుండా గదిలోపలకు వెళ్ళాడు బెడ్ రూమ్ తలుపు తాళం వేసివుంది పెన్ టార్చి వెలుగులో తాళం వొక నిముషం పరీక్ష చేసి బొద్దొంచి తాళం చెవులు గుత్తి తసి క్షణంలో తలుపు తెరిచాడు చింటూ.

"అవ్ అవ్" అంటూ భయంకరంగా అరుస్తూ మీద పడింది అల్సేషియన్ చింటూ జబ్బను నోటితో పట్టి పీకి కాలిగోళ్ళతో వళ్ళంతా చీర సాగింది.

పక్కనున్న పూలకుండీ తీసుకుని బలం కొద్దీ కుక్క నెత్తిన బాదాడు రంగ తల దిమ్మరపోయి పట్టు వదిలింది కుక్క. బలం అంతా వుపయోగించి కాలితో కుక్క మెడమీద తొక్కాడు చింటూ! రెండు నిముషాల్లు గిలగిల లాడి ప్రాణాలు వదిలింది అల్సేషియన్ కుక్క!

తాత రెండు అల్సేషియన్ కుక్కలున్నయ్యని చెప్పాడు కింద ఒక కుక్కను గోతాంతో కట్టివేసి నప్పుడు రెండో కుక్క ఏమయిందా అనుకున్నాడు చింటూ! కాంపౌండ్‌లో ఏ మూలో వుందని మనసు సరిపెట్టు కున్నాడు అదాటుగా తలుపు తీసే సరికి జబ్బ పట్టుకు పీకింది! రంగ లేక పోతే ఇవ్వాళ నూరేళ్ళు నిండేవినాకు అనుకుంటే పళ్ళు జలదరించింది.

లోపలకు వెళ్ళి ఇనప్పెట్టి పరిశీలించి చూచి తాళం తీయటానికి రెండు నిముషాలు పట్టింది చింటూకు. తలుపు తెరిచి నోట్లకట్టలూ నగలూ తీసి వెంట



# సంకెళ్ళెవరికి?

తెచ్చిన సంచీలో వుంచుకుని మళ్ళీ నీళ్ళ గొట్టం పట్టుకుని కిందకు దిగాడు

'అరె' ఆ రక్తం ఏమిటి ? అంటూ సత్రున చీరెచింపి అతని జబ్బకు తగిలిన గాయానికి కట్టు కట్టింది రూప

వళ్ళంతా చీరుకుపోయిందే? రూప మాటలు పట్టించుకోకుండా చప్పున వచ్చిన దారినే గోడ దూకి రోడ్డున పడ్డారు వాళ్ళు రోడ్డు దాటగానే చెట్టియార్ కారు బంగళాలోకి వచ్చి ఆగింది

తెరచి వున్న ఇనప్పెట్టి బెడ్‌రూమ్ ముందు చచ్చి పడి వున్న అల్సేషియన్ కుక్కనూ చూడగానే చెట్టియార్ బెంబేలెత్తిపోతూ ఫోన్ దగ్గరకు పరిగెత్తాడు! ఫోన్‌లోంచి ఏ శబ్దం రాకపోయేసరికి కిందకు పరిగెత్తి కారు వేసుకుని పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు

హడావిడిగా వచ్చిన చెట్టియార్‌ను చూచి నిద్ర మత్తుతో జోగుతున్న కానిస్టేబిల్ లేచి నిలబడి ఇందాక మీరేనా దోపిడి జరుగబోతుందని ఫోను చేసింది? అన్నాడు

జరుగబోతుందేమిటయ్యా! జరిగిపోయింది! నా కొంప గుండం అయిపోయింది అని నెత్తి బాదుకున్నాడు చెట్టియార్

మరి అలా చెప్పలేదేం ఇందాక

ఏమిటయ్యా నీ నిద్రమోతు మాటలు! అవతల ఇల్లు దోచుకుని పోతే! ఎంత ఘోరం! అల్సేషియన్ కుక్క తల పగలగొట్టి చంపారు

క్యాష్ యాభై వేల రూపాయలు ఎత్తుకుపోయారు రవ్వల నగలు రెండు లక్షల ఖరీదు చేస్తాయి!

అరి బగవంతుడా! ఇక ఎలా బతకాలిరా!' చెట్టియార్ గోలకు కానిస్టేబిల్ నిద్రమత్తు పూర్తిగా వదిలింది

* * * *

చెట్టియార్ చేసిన గోల అంతా ఇంతా కాదు టవున్లోని రాజకీయ నాయకులకేగాక తనకు తెలిసిన మినిస్టరుకు ఫోను చేసాడు

తెల్లవారే సరికి పోలీసు డిపార్టుమెంట్ యావత్తూ తరలి వచ్చింది పోలీసు కుక్కల్ని తెచ్చారు! అవి ఇనప్పెట్టి దగ్గర్నుంది కాంపౌండ్‌లో చింటూ వాళ్ళు గోడు దూకిన చోటు మీదుగా టవున్‌లో వొక వైపుకు వెళ్ళాయి మీనాక్షి థియేటర్ ముందు అవి ఆగిపోయి అటూ యిటూ చూడసాగాయి 'రాత్రి సినిమా వదిలేక వందలాది జనం వెళ్ళి వుంటారు ఆ బజారున ఆ తర్వాత కుక్కలు ఇక కదలలేదు! దొంగల నుండి వచ్చిన వాసన ఇక అక్కడ నుండి వీక్ అయిపోయింటుంది' అన్నాడు కుక్కలను ట్రియిన్ చేసినతను

ఇనప్పెట్టి తీసిన తీరు ఆశ్చర్యం కల్గించింది అందరకు పావు అంగుళం మందం వున్న ఇనప రేకులతో ప్రత్యేకంగా చేయించుకున్నాడు చెట్టియార్

మొన్న శనివారం రాత్రి మద్రాసు నుండి యాభై వేలు డబ్బు వచ్చింది పెండ్లికి వెళ్ళాలని ఇంటామె లాకర్ నుండి నగలు తెచ్చుకున్నది అంతకు క్రితం రోజే!

ఆదివారం రాత్రి సినిమాకు వెళ్ళాము తిరిగి వచ్చేసరికి కొంప గుండమయిపోయింది డబ్బు పోతేపోయింది ఎటువంటి నగలు! అటువంటి రవ్వలు మళ్ళీ దొరుకుతయ్యా! చెట్టియార్ గోడు గోడున పోలీసాఫీసర్లకు జరిగిన విషయం చెప్పసాగాడు

తాళం చెవులు లేకుండా ఇలాటి ఇనప్పెట్టి తీయగల వాడు తమిళనాడు మొత్తంలో చింటూ ఒకడే చెట్టియార్ ఇంట్లో డబ్బు అట్టే పెట్టుకున్నాడని అతనికి తెలిసిందంటే పరిసర ప్రాంతాలలో అతని అనుయాయులు ఎవరైనా వుండి వుంటారు

చెంగల్పట్టు జిల్లా నుండి అతను పారిపోయాడని విన్నాం! ఇక నార్తార్కాట్ జిల్లాకు మకాం మార్చినట్టున్నాడు! మన ఫోర్సును ఎలర్ట్ చేయండి అంటూ వెళ్ళిపోయాడు డి ఐ జి నాయర్, నార్తార్కాట్ జిల్లా యస్ పి శాస్త్రి యస్ సర్' అంటూ అయనను సాగనంపి వచ్చి

దిగులు పడకు చెట్టియార్! నీ సొమ్ము రికవర్ చేస్తాంలే అంటూ ధైర్యం చెప్పాడు

ఏమో సార్! అంతా మీ దయ అంటూ కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళాడు చెట్టియార్

* * * * *

రవ్వల నగలూ 'డబ్బూ సుబ్రమణ్యానికి వొప్ప చెప్పి నులక మంచం మీద పడిపోయాడు చింటూ–

"అరె! వళ్ళంతా గాయాలే' అంటూ ముందుకు వచ్చి అతని వళ్ళంతా పరీక్షగా చూసి

బుజం మీద లోతుగా గాయం అయింది వళ్ళంతా చీరుకు పోయింది అంటూ ఘుంట్లోకి వెళ్ళి కుండులోంచి ఏవో ఆకులు తెచ్చి పసరు పిండి గాయాల మీద పోసి పాత గుడ్డలు తెచ్చి కట్టుకట్టింది మణి

గాయాలు సెప్టిక్ అవుతయ్యేమో ? అనిపించినా మాట్లాడకుండా చూస్తూ వుండి పోయింది రూప

అతను తొడుక్కున పాంటు నెమ్మదిగా విడిచేసి లుంగికట్టింది మణి, వీసన'

## గడుసులోకం

— బాబు






# కోటయ్య అనుభవం- స్వనోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...

అరె, కోటయ్యా నువ్వా!

ఏరోయ్ సూరి, ఎలాగున్నావ్!

బాగానే ఉన్నాలే. నీ ఎడ్ల గురించి రామన్న చెప్పాడు. చాలా బాధైందనుకో!

ఏంజేస్తాం... దేవుడలా పెట్టాడు.

కోటయ్య ఎడ్లు మేస్తుంటాయి... ఉన్నట్టుండి చెవులు దద్దరిల్లే శబ్దం... రాళ్లూ మట్టీ దొర్లివస్తాయి. గాభరా పడ్డ కోటయ్య ఎడ్లను కాపాడుకునే ప్రయత్నంలో...

భగవంతుడా... నా ఎడ్లను కాపాడు తండ్రీ!

ఎంత గోరం! ఇపుడెట్టా గడుపుతున్నావ్ మరి!

అదృష్టం కొద్దీ న్యూ ఇండియా వాళ్లతో పశువుల భీమా చేయించుంచా. లేకుంటె మునిగిపోయుండేవాణ్ణి.

... కిందటి సంతలో రెండు కొత్తెడ్లు కూడా కొన్నా!

అబ్బో! అంత డబ్బు కూడబెట్టావా!

డబ్బెక్కడ కూడబెట్టాను! పశువుల భీమా చేయించానని చెప్పాగా!

పశువుల భీమా, పశువుల భీమా అంటున్నావు. అదేమిటీ!

పశువుల భీమా అంటే... ప్రమాదంలోనో రోగంతోనో నీ పశువులు చచ్చిపోయాయంటే న్యూ ఇండియా వాళ్లు నీ నష్టానికి డబ్బు కట్టిస్తారు.

ఉట్టినే డబ్బిచ్చేస్తారా?

ఊహుఁ. ఏడాదికింత అని మనం కాస్త డబ్బు కట్టాలి. మన పశువు 100 రూపాయలనుకో, మహా అంటే 4 రూపాయలు చాలు!

అలాగా! ఈ సంగతి నాకు తెలీదే!

ఇప్పుడు తెల్సింది కదా! నష్టాలు వచ్చినప్పుడు భీమాయే మనకు ఆధారం!

SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

## సంకెళ్లు వరికి?

క్రతో విసురుతూ-

గాడిద మాంసం తెప్పించి వండి పెడతాను. ఎలాటి గాయమైనా మాయ మవుతుంది తాత నల్ల మందు గుళిక ఇస్తాడు. అది మింగావంటే నొప్పులన్నీ తగ్గిపోతాయి" అంటూ అతనితో కబుర్లు చెప్ప సాగింది

చింటూ మూల్గుతుంటే "పుండు వళ్ళు అంతా అమృతాంజనం మర్దన చేస్తాను అంటూ అతని శరీరాన్ని యావత్తు అమృతాంజనం పాముతూ వుండి పోయింది శరీరం గిరుకు పోయిన చోట అమృతాంజనం తగిలి మంటపుట్టి పెద్దగా మూలగ సాగాడు చింటూ.

అప్పుడే లోపలకు వచ్చిన ఛమేలీ "ఏమయిందిరా చింటూ"? అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ వచ్చి మంచం పక్కన కూర్చుంది.

ఈ గాయాలేం చేస్తాయి అత్తా! రేపీ పాటికి లేచి తిరగడూ"! అంటూ లోపలకు వెళ్ళింది మణి

మణి లోపలకు వెళ్ళగానే గట్టిగా నిట్టూర్చింది రూప ఆ అమ్మాయి అలా అతి చనువుగా చింటూ వంటిని మర్దన చేయటం చూడలేక అప్పటి వరకూ తలపక్కకు తిప్పుకుంది

తాత వచ్చిన డబ్బంతా చిదంబరానికిచ్చి కోయం బత్తూరు పంపాడు నగలు సారంగపాణికి యిచ్చి బెంగుళూరు పంపాడు. ముందు జాగ్రత్త కోసం అతను పని చేసాడు పోలీసుపార్టీ ఏదయినా తమ గ్రామం రెయిడ్ చేసినా అచూకీ ఏమి దొరకదు!

సాయంత్రానికి చింటూమూలుగు ఎక్కువయింది. ఛమేలీ అతని వళ్ళు పట్టుకు చూసి అన్నపు కుండలా వళ్ళు ఎలా కాలిపోతున్నదో" అంటూ ఆదుర్దా పడసాగింది.

పరవాలేదత్తా! గాడిదమాంసం తినిపిద్దాం. జ్వరం నొప్పులూ పోతాయి అంటూ స్టీలు పళ్ళెంలో అన్నం మాంసం కూరా తెచ్చి బలవంతంగా అతనికి తినిపించసాగింది రెండు ముద్దలు తిని అడ్డంగా తల తిప్పుతూ మంచం మీద పడి పోయాడు చింటూ

చీకటి పడ్డాక మూలుగు ఎక్కువయింది గూడెంలోని వాళ్ళందరూ ఒక్కొరూ వచ్చి చింటూను చూసి వెళ్ళిపోసాగారు, కాని అతను ఎవరినీ గుర్తు పట్టకుండా మగతగా పడివుండి, మూల్గసాగాడు

పొద్దు పోయేసరికి ఎటువాళ్ళటు అస్త వ్యస్తంగా పడి నిద్రపోసాగారు వాళ్ళలో చాలామంది నాటు సారా పూర్తిగా పట్టించారు

మణి ఇచ్చిన నల్ల మందు గుళిక వల్లో ఏమో చింటూ దగ్గర నుండ పెద్దగా మూల్గు శబ్దం వినరావటంలేదు.

నిద్రపట్టక రూప అరుగు మీద అటూ యిటూ పొర్లు సాగింది అర్ధ రాత్రప్పుడు ఎందుకో అనుమానం వచ్చి చింటూ మంచం దగ్గరకు వెళ్ళి అతని నుదుటి మీద చేయి వేసి చూచింది చల్లగా మంచు ముక్కను ముటు కున్నట్లనిపించిందామెకు

చింటూ వూపిరి గట్టిగా లాగుతున్నాడు చూస్తుండగానే అతని శరీరంలో విపరీత మైన కదలిక బయల్దేరి గడ గడ వణికి పోసాగాడు పక్కన వున్న దుప్పట్లు తీసి ఒకోటీ కప్ప సాగింది రూప ఎన్ని దుప్పట్లు కప్పినా అతను వణకడం ఎక్కువయింది గాని తగ్గలేదు

రూపకు ఏదో భయం కల్గి తాతను లేపింది. అతను వచ్చి చూసి శీతజ్వరం! చాలా ప్రమాదం" అంటూ మంచం ప్రక్కనే కూర్చుండి పోయాడు

అతని ముఖంలో కనపడుతున్న ఆదుర్దా చూడగానే రూప మనసులో భయం ఎక్కువయింది

ఏం చేద్దాం"?

"చేసేదేముంది! అదృష్టం బాగా లేదు ఇలా వచ్చాక ఎలాగయినా గట్టెక్కటం కష్టం' తల దించుకుని అన్నాడు తాత.

(ఇంకా ఉంది)

# బహుమతి



అది జీతాలు సరిపోని తరగతి.. చిల్లరకొట్లో ఖాతాలు పెంచే తరగతి. మొహమాటాల తరగతి... అరుంధతి నక్షత్రం కన్నా అప్పును బాగా చూస్తున్న తరగతి – మధ్యతరగతి అని తెలిసిపోయే వుంటుంది. ఆ తరగతికే చెందుతాడు పాపం కృష్ణమూర్తి.

ఎం. ఎ. చేశాడు. ఎన్నో పరీక్షలు వ్రాశాడు. ఇంటర్వ్యూలకు వెళ్ళాడు. పెద్ద ఉద్యోగాలు వెక్కిరించుకుంటూ వెళ్ళిపోయాయి, నీకు నాకూ ఏ విధమైన సంబంధం లేదన్నట్టు. అయితే కొన్నేళ్ళకి ఓ పెద్ద ఆఫీసులో చిన్న అకౌంట్స్ క్లర్క్‌గా జాయినైపోయాడు.

పాతవాళ్ళ ఛాదస్తమో, తన అనాలోచనో అయిదుగురు పిల్లలకు తండ్రయ్యాడు.

సరిపోని సంపాదన.

చికాకు కలిగించే ఆఫీసు వాతావరణం.

సమస్యల సాలెగూడు లాంటి ఇల్లు ... క్రమక్రమంగా మూర్తిలో కోపాన్ని పెంచాయి.

ఇద్దరమ్మాయిలు పెళ్ళికెదిగొచ్చారు. 'ఆడపిల్లలకి అంత చదువు ఎందుకురా' అంది మామ్మ. దాంతో వాళ్ళ చదువులకు బ్రేకు పడింది.

ఇక చదివిద్దామన్నా చదువు అంటని ఇద్దరు కొడుకులు. బలహీన పద్మ భార్యకి మందులు... డాక్టర్ ఫీజులు.

* * * *

ఆ రోజు ఆఫీసులో హెడ్‌గుమస్తా కోటేశ్వర్రావుకు ట్రాన్స్‌ఫర్ అయింది. ఆ సందర్భంగా పార్టీ అన్నారంతా. ఓ ఇరవై నోటు మూర్తి జేబు ఖాళీ చేసేసింది.

అది జరిగి వారమైనా కాలేదు. బంధువులింట్లో ఏదో పెళ్ళి ఓ పాతికపెట్టి ఓ స్టీలు పళ్ళెం.

'డబ్బు ఇబ్బందుల్లో వున్నప్పుడే ఇలాంటివి మరి ఎక్కువవుతాయి' అనుకున్నాడు.

ఆఫీసు నుంచి ఇంటికి రాగానే చెప్పింది భార్య – "ఏమండీ ఇల్లుగలావిడ వచ్చేనెల నుంచి మరో యాభై పెంచితే- సరేసరి లేకపోతే మరో ఇల్లు చూసుకోమని ఖచ్చితంగా చెప్పేసింది."

"మనమిచ్చే అద్దెకి మరో ఇల్లు దొరుకుతుందా... తప్పదు.. ఇక్కడే అడిగినంతా ఇచ్చుకుని వుండటమే."

* * * *

కృష్ణమూర్తి మనసు చాలా చికాగ్గా వుంది. కుటుంబ సమస్యలు చాలా భయంకరంగా కనిపిస్తున్నాయి.

కాసేపు ప్రశాంతత కోసం సముద్రపు ఒడ్డుకు వచ్చాడు.

ఎగిరిపడే కెరటాల్ని చూస్తున్నాడు. ఆ వాతావరణం కోసం ఎక్కడెక్కడ్నుంచో వచ్చే

## మంత్రువాది మహేశ్వర్

జనాన్ని చూస్తున్నాడు. జంటలుగా వచ్చే వారి ఆనందాన్ని చూసి ఈర్ష్య పడ్డాడు. వారి ఆనందం చిరకాలం నిలవాలంటే తన కుటుంబ పరిస్థితులు వారికి రాకూడదనుకున్నాడు –

పెద్దబ్బాయి కాలేజీ డొనేషను....

ఆఖరివాడికి పుస్తకాలు...

మందుల ఖర్చు ... డాక్టరు ఫీజు.

పెరిగిన ఇంటి అద్దె.....

పేరుకుంటున్న అప్పు ... వరుసగా కనిపిస్తున్నాయి.

'ఈ సమస్యల నుంచి విముక్తికి ఆత్మహత్య చేసుకోవడమేనా అనిపించిందో క్షణం.

'సంసారం సాగరం' గుర్తొచ్చి అక్కడా వుండ బుద్ధి కాలేదు. అక్కడే వున్న పాండురంగస్వామి దేవాలయానికి వచ్చేశాడు.

'నువ్వు చేసిన తప్పుకి నీ వాళ్ళని రోడ్డు మీదకు



# బహుమతి

ఈడ్చుదామనా '

"నువ్వు చేయబోయే పాపం జన్మ జన్మలకూ నిర్నొదలదు" పాండురంగస్వామి అన్నట్లని పించింది.

ఎందుకో ఎక్కడలేని ధైర్యం ఒంట్లోకి ప్రవేశించినట్లయింది

"చేతనైతే నీ సమస్యలు మరెవరికీ కలగకుండా జాగ్రత్త పడేలా చేయి" అని ఆ స్వామి అన్నట్లనిపించింది.

★ ★ ★ ★

పిలుపులంటే మూర్తికి చికాకే.... సమస్యే.... కానీ ఇప్పుడలా కాదు. అతను ప్రతి ఫంక్షన్‌కీ వెళ్ళకపోయినా "పెళ్ళి" అంటే వెళ్ళడం మానడు.

కేవలం జీతం రాళ్ళమీద బ్రతికే చాలామందికి మూర్తి ధోరణి ప్రత్యేకంగా కనిపించింది చాలా రోజులు.

ఓ రోజున చిన్నప్పటి ఫ్రెండు, ఆఫీసులో నే సెక్షన్ ఆఫీసర్‌గా పని చేస్తున్న కోదండరామయ్య ఆయన భార్యావచ్చి పెద్దకూతురు శైలజ పెళ్ళని తప్పకుండా రావాలనీ పత్రికిచ్చారు.

బాలాజీ భవన్‌లో నే పెళ్ళి.

చాలా ఆనందం కలిగింది మూర్తికి.

భార్యే అడిగింది, "ఏమండీ నెలాఖరులో యిదో ఖర్చామనకి "

"వెళ్ళకపోతే ఎలాగ చెప్పు" అన్నాడు.

★ ★ ★ ★

కోదండరామయ్య పెళ్ళి ఏర్పాట్లు ఘనంగా చేశాడు.

చదివింపుల కార్యక్రమం అవుతోంది.

అంతా హడావిడిగా వుంది

మూర్తి ఓ కవరు తీసుకొచ్చి చదివింపుగా కాకుండా పెళ్ళికూతురు చేతిలో పెట్టేడు. ఓ చిన్న నవ్వు నవ్వి, మొహమాటంగా తీసుకుని అక్కడి పెద్ద పళ్ళెంలో పెట్టేసింది.

అంతా వెళ్ళిపోయాక, హడావిడి తగ్గాక వచ్చిన ప్రజెంటేషన్స్ చూసుకుంటూండగా ఓ కవరు కనిపించింది. అందులో "గిఫ్ట్ చెక్" వుంది. ఇచ్చిందెవరో మధు చక్రవర్తి. అలా రెండు మూడు కవర్లు. ఆ తరువాత మరో కవరు. కాగితం ఒక్కటే వుంది.. . తీసి చదివితే–

చిరంజీవి సౌభాగ్యవతి శైలజ,

పసుపు కుంకుమలతో పది కాలాలపాటు చల్లగా వుండమ్మా

నా జీవితంలా మరొకరి జీవితం నరకం కాకూడదనే తపనతో వ్రాస్తున్నాను ఈ రోజున "పెళ్ళి" అన్న మాట వినబడితే నాలో కలిగే భయానికి కారణం 'పరిస్థితులు'. కొత్తలో పెద్దవాళ్ళు చెప్పిన దానిని కాదనలేక సంసారాన్ని పెంచుకున్నాను. ఆర్థిక పరిస్థితి గురించి ఆలోచనే లేదు అప్పట్లో.... రేపు పిల్లలకి ఏం దారి చూపిస్తాను అన్న భావనే రాలేదు.

నేను కళ్ళు తెరిచేసరికి పరిస్థితులు నా చేతుల్లో లేవు. ఆనందంగా వుండాల్సిన భార్య– అనారోగ్యంతోను, ఆడుతూ పాడుతూ వుండాల్సిన పిల్లలు క్రమశిక్షణ లేకుండాను తయారయ్యారు. బయటి పిల్లలతో పోల్చుకుని 'నువ్వు మాకేం చేస్తున్నావు' అని ప్రశ్నిస్తున్నారు

నిజమే– వాళ్ళ సరదాలు ఏం తీర్చానని నేను.

ఒకోసారి ఈ పరిస్థితులు, ఇబ్బందులు గుర్తొచ్చేసరికి పెళ్ళెందుకు చేసుకున్నాను అనిపిస్తుంది నిజమే. మనిషికి పెళ్ళి అవసరమే. కానీ ఒక తోడు కోసం ... ఒంటరితనంతో జీవితాన్ని ఎదిరించలేక....

పెద్దవాళ్ళ మాటలు అలా వుండడానికి అప్పటి పరిస్థితులు వేరు కాలం మారిపోయింది. మనమూ మారాలి. మారిన కాలంతో మనం మారకపోతే ఎదురయ్యేవి నా పరిస్థితులే.

ఎవరైనా పెళ్ళికి పిలిస్తే వెడతాను. అయితే అందరూ ఇచ్చేలాంటి బహుమతుల్ని నేనివ్వలేను.

నా పరిస్థితి ఇదని– దానిక్కారణం ముందు చూపు లేకపోవడమని నా అనుభవం మరో జంటకి జీవితపాఠం కావాలనే కోరికతో యిలా వ్రాస్తుంటాను అదే నా "బహుమతి"

అనుక్షణం సమస్యలెదుర్కోలేని పరిస్థితుల్లో ఆత్మహత్య చేసుకోవాలనిపించి కుటుంబం మరింత ఛిన్నాభిన్న మవుతుందని అది సరియైన ఆలోచన కాదని– ఈ పరిస్థితి ఎవరికీ రాకుండా చేయడానికైనా నేను జీవించి వుండాలనీ అనుకుంటూ వుంటాను.

మిమ్మల్ని బాధ పెట్టాలన్న ఉద్దేశ్యంతో ఇది వ్రాయలేదని గ్రహిస్తే చాలు.

ఇట్లు,
కృష్ణమూర్తి

చదవగానే శైలజ కళ్ళవెంట బొటబొటా నీటి బొట్లు రాలాయి.

అన్ని బహుమతుల్లో తనకి అదే విలువైనదిగా అనిపించింది.

★ ★ ★ ★

మూర్తి మర్నాడు ఆఫీసులో సెక్షనుకు వెళ్ళిబోతుండగా కేంటిన్ ప్రక్కగా నిలబడ్డ కోదండరామయ్య గారితో ఎవరో ఆఫీస్ స్టాఫ్ మాట్లాడుతున్నారు

"పెళ్ళి బ్రహ్మాండంగా చేశారండి అవును కృష్ణమూర్తి ఏదో కవరిచ్చినట్టున్నాడు. అందరికీ యిచ్చేలాంటిదేనా" అంటూ హేళనగా నవ్వారు.

"నిజమే.. అతనిచ్చింది అందరికీ అలాగే కనిపిస్తుంది. కానీ అందులో ఎవరూ అందించని, అందించలేని విలువైన సందేశం వుంది. అల్లుడు కూడా చాలా సంబరపడ్డాడు దానిని ఫ్రేమ్ కట్టించి బీరువాలో భద్రపరచమని అమ్మాయితో చెప్పాడట. బహుమతుల నాశించి ఎవరినీ పిలవం.... వారు మంచి మనసుతో ఆశీర్వదించాలని కోరుకుంటాం.... అంటూ కోదండరామయ్య గారు అంటూంటే ఆ మాటలు మూర్తి చెవిన పడ్డాయి

ఆనందంతో కళ్ళు చమర్చాయి. తనని ఈ రోజుల్లోనూ సవ్యంగా అర్థం చేసుకోగలిగే మనుషులున్నందుకు. □

## భారత దేశంలో గ్రంథాలయాలు!

భారత దేశంలో మొత్తం 60 వేల పరనాలయాలున్నాయట ఇందులో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన వో 500, పెద్ద సంస్థలకు సంబంధించిన లైబ్రరీలు వో 10 వున్నాయట

## మోస పోయిన మగువ!

అమెరికాలో వో 25 ఏళ్ల జిన్నిస్ అనే యువతి మార్జువానా అనే వొకరకం మత్తు పదార్థాన్ని 150 డాలర్లకు కొన్నదట అతి రహస్యంగా ఆనక చూసుకుంటే అది మోసపు సరుకుని, సముద్రం పక్కన పెరిగే పిచ్చి మొక్కలు మూటకట్టి యిచ్చినట్టూ తేలి, కోపంతో పరుగున వెళ్లి తనను మోసం చేశారని చెప్పి కేసునమోదు చేయమన్నదట దానికా అధికారి విస్తుపోతూ అమ్మణ్ణీ! మత్తు పదార్థాలు కొనడమె చట్ట విరుద్ధమని చెప్తుంటే, ఆ కొనుగోలులో గోల్‌మాల్ అయ్యిందని




కేసు పెట్టానంటావా అన్నాడట

## అమెరికన్ పత్రికకి బేనజీర్ నోటీసు!

తన మీటింగులకు రావడానికి తల ఒక్కంటికి రోజుకు వంద రూపాయలు తానిస్తున్నట్టు, ఆడబ్బు తనకు సోవియట్ యూనియన్ యిస్తున్నట్టు పాకిస్థాన్ ప్రసిడెంట్ జియా-ఉల్-హక్- వో అమెరికన్ పత్రికలో యిచ్చిన యింటర్వ్యూలో అన్నట్టు ఆ పత్రిక ప్రకటించినందుకు బేనజీర్ భుట్టో అభ్యంతరం తెలుపుతూ ఆ పత్రికకూ, జియా ఉల్‌హక్‌కూ నోటీసులు పంపారట రెండు వారాల్లో తమ పత్రికలో క్షమార్పణలు తెలుపుతూ, తనకు నష్టపరిహారంగా నాలుగు వారాలలో ఫది కోట్ల రూపాయలు చెల్లించాలని ఆ పత్రికకు బేనజీర్ నోటీసు యిచ్చారట

## శృతి మించిన తగాదాలో ఒకని

అనే అయన కూతురు 12 ఏళ్ల వళ్లి ధర్మరాజ్ అనే అతని తోటలో పనికి కుదిరిందట ఒక రోజు ఆ ధర్మరాజు ఆమెను తన షాపులో పని చేయమన్నాడట అది అధర్మమని, తోటలోనూ, షాపులోనూ పని చేయమనడం న్యాయంకాదని మూక్కయ్య ధర్మరాజుతో పోట్లాటవేసుకున్నాడట ఈ పోట్లాట శృతిమించి ధర్మరాజు తనకు చేతివాటంలో వున్న పచ్చడిబండతో మూక్కయ్య నెత్తిన శక్తివంచన లేకుండా ఒకటిచ్చాడట ఆ దెబ్బకు తలపగిలి, మూక్కయ్య అక్కడే విలవిల్లాడి చచ్చిపోయాట్ట

## స్పెయిన్ పత్రికలలో వింత ప్రకటనలు!

స్పెయిన్ పత్రికలలో పోలీసు డిపార్ట్ మెంటులో కి వుద్యోగాలకు దరఖాస్తులు కోరే టప్పుడు కొన్ని అవ లక్షణాలు పేర్కొంటూ, అవి వుంటే వుద్యోగానికి దరఖాస్తు పెట్ట వద్దని ప్రకటనలు వుంటాయట మీరు చాలా అసహ్యంగా వున్నా, లావుగా పెద్ద పొట్టతో వున్నా, పళ్ళు లేక పోయినా, బట్టలూడ దీయిస్తే ఎముకలు కనిపించేలా వున్నా, వరిబీజం వున్నా, వృషణాలు అసలు లేక పోయినా




మీద యీ వుద్యోగానికి అనర్హులు అనుకుంటుందట

## పట్టుపడిన దొంగ నోట్ల వ్యాపారులు!

కేరళకు చెందిన పులి కాత్తడమ్ అనే వూరిలో ధనశేఖరన్ అనే వొ హతను వో వీడియో కేమెరాలు అమ్మే షాపుకు వెళ్ళి, కేమెరాకొని డబ్బు చెల్లించాడట. అందులో ఫది రూపాయల నోట్లు దొంగ నోట్లుగా అనుమానించిన ఆ షాపు యజమాని థామస్ ఝూ విషయం పోలీసు రిపోర్టిస్తే వారొచ్చి డొంకంతా కదిపారట. దనశేఖర్, అతని స్నేహితులో అరుగురు వెరసి ఏడుగురూ కలసి ఫది రూపాయల నోట్లు రహస్యంగా అచ్చు వేస్తున్నారట

## జైలు సెల్‌లో దొంగతనం!

ఫ్లోరిడాకు చెందిన పాంపెనో బీచి వొద్దున వున్న జైలులో శిక్ష అనుభవిస్తున్న వో ఖైదీ, జైలు వారి




అనుమతితో తన రూములో వో టి. వి వీడియో సెట్టు, కేసెట్టు ప్లేయరూ అన్నీ ఎంచక్కా అమర్చుకున్నాడట. ఒక రోజున వో దొంగ వచ్చి యీ ఖైదీకి పిస్టలు చూపి, ఆ వస్తువు లన్నీ ఎత్తుకు పారిపోయాడట- జైలు సెల్ లోంచి అంత లాఘవంగా ఎలా జరిగిందోనని అధికారులు ఆశ్చర్య పోతున్నారట!

## తండ్రిని చంపిన తనయుడు!

నాత్తమ్ గ్రామానికి చెందిన పెరుమాళ్ అంబలం అనే అతని సుపుత్రునికి ఏ వుద్యోగమూ లేకపోడంతో తండ్రి డబ్బుతో వో కారు కొనుక్కుని, దానిని టాక్సీగా తిప్పి సంపాదించుకోవాలనే కోర్కె పుట్టిందట ఆ కోర్కెకు పెరుమాళ్ అంబలమ్ ఒప్పుకోక పోయేసరికి పుత్రుడు నల్లయప్పన్‌కు కోపం వచ్చి తన తండ్రి చేయి వూతానికి వుపయోగించే ఇత్తడి పిడి వున్న చేతి కర్రతో తండ్రి తల మీద నాలుగు బాదులు బాదాడట నల్లయప్పనుకు కోపం దిగేసరికి అంబలం చనిపోయాడట – పోదామరి! □

సీరియల్:

# నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

ఆ రోజు చాలా పిండివంటలు చేయించారు అనసూయమ్మ డైనింగ్ టేబుల్ స్వీట్స్‌తోనూ పిండివంటలతోనూ నిండిపోయింది. తల్లీ, కొడుకూ, కోడలు డైనింగ్ టేబిల్ ముందు కుర్చీలలో ఆశీనులయ్యారు పళ్ళెలని వరసగా పేర్చి 'ఆరు' లెక్కించాడు రఘు.

'వెంకాయమ్మగారూ! ఈ ఆరు రకాలేనా మీరు చేయగలరు?' అడిగాడు ఎదురుగా నిలబడివున్న వెంకాయమ్మని గమ్మత్తుగా.

'అదేంటి బాబూ! యింకా చాలా రకాలు చేయగలను!' అంది మామూలు ధోరణిలో.

"వాడి మాటలకేంగానీ, వెంకాయమ్మగారూ! తొందరగా వడ్డించండి! ఆఫీసుకి టైమయిందని తర్వాత రేణు దగ్గర చిందులు తొక్కుతాడు!' పురమాయించారు అనసూయమ్మ

ఆఫీసుకు బయలుదేరాడు రఘు స్కూటర్ ఎక్కి కూర్చున్నాడు వెనుకనే వెళ్ళింది రేణు భర్త ఎదురుగా నిలబడి-

"మళ్ళీ మిమ్మల్నెప్పుడు చూస్తాను?" అడిగింది.

'ఏమిటా ప్రశ్న?" ఆశ్చర్యపోతూ అడిగాడు

"అదికాదండి! ఈ రోజు సాయంత్రం నాలుగ్గంటలకల్లా వస్తానన్నారు! జ్ఞాపకం వుందా?"

'ఓహ్! అదా! మూడున్నర గంటలకే ఈ రేణుకాదేవిగారి సన్నిధిని వుంటా! సరా?' అనేసి స్కూటర్ స్టార్ట్ చేసాడు భర్త గేటుదాటేవరకూ చూస్తూ నిలబడింది

ఆ పనీ ఈ పనీ ముగించుకొనేసరికి పదకొండు గంటలు దాటింది అత్తగారి గదిలో ప్రవేశించింది అత్తగార్కి కొంతసేపు భగవద్గీత చదివి విన్పించింది మనవడ్ని పక్కలో పెట్టుకొని నిద్రపోయారు అత్తగారు పన్నెండున్నరైంది భగవద్గీతను మూసి షెల్ఫ్‌లో పెట్టింది తలుపు దగ్గరగా వేసి మేడమీద తన గదిలోకి వెళ్ళింది వారపత్రికలో సీరియల్ చదవనారంభించింది

మధ్యాహ్నం ఒంటి గంటైంది బయట గేటు ముందు కారు ఆగింది హారన్ మ్రోగుతోంది కిటికీలోంచి బయటకు చూసింది రేణు ఎవరో ముగ్గురు పెద్దమనుషులు కారు దిగారు భర్తకోసం ఎవరో స్నేహితులొచ్చారనుకొంది గబగబా మేడ దిగింది అప్పటికే వారు గేటుదాటి ముందు వరండాలోకివచ్చి నిలబడ్డారు

వారు చెప్పిన మాటలకి మ్రాన్పడింది రేణు ఏడుస్తూ అత్తగారిని లేపింది

'ఏమిటమ్మా! ఏమైంది?" కంగారుగా ప్రశ్నించారు అనసూయమ్మ

"మీ అబ్బాయిగారికి స్కూటర్ ఏక్సిడెంటయిందట! హాస్పిటల్లో అడ్మిట్ చేసారట!" ఏడుపుని దిగమింగుకోలేక పోతూ చెప్పింది రేణు

అనసూయమ్మకి కంగారెక్కువైంది

అవునండి! తలకి పెద్ద గాయం తగిలింది చాలా రక్తం పోయింది డాక్టర్లు కూడా కంగారుపడుతున్నారు! ప్రాణాపాయం వుండకూడదనే అంటున్నారు! ఈ విషయం మీతో చెప్పడానికి వచ్చాం!"

చెప్పాడొకాయన తర్వాత రెండో అతను చెప్పనారంభించాడు

'మీ వాళ్ళ నెవరినైనా రమ్మంటారా? అని అడుగుదామనుకొన్నాం! కానీ ఆయనకు స్పృహలేదు!

"మరి మేం వస్తామండి! భయపడకండి!

అన్నింటికి ఆ భగవంతుడే ఉన్నాడు రఘునాధరావుగారు పెద్ద మనసున్న వ్యక్తి. భగవంతుడు అన్యాయం చేయడు!" ఓదార్చాడు మూడోవాడు

'హాస్పిటల్‌కి వెళ్ళి మరోసారి ఆయన పరిస్థితి చూసి కంపెనీకి వెళ్ళి చెబుతాం!" అన్నాడు మొదటివాడు

"నేనూ వస్తానుండండి!" అంటూ అత్తగారివైపు చూసింది రేణు ఆమె అనుజ్ఞకోసం

"వెళ్ళమ్మా! వెంటనే ఫోనుచెయ్ వాడికెలా వుందో! తొందరచేసింది అత్తగారు

ఎదురుగావున్న వెంకటేశ్వరుని పటానికి నమస్కరించి బయలుదేరింది రేణు

"వాడు కులాసాగా యింటికివస్తే కుటుంబ సమేతంగా నీ కొండకొచ్చి దర్శనం చేసుకొంటాం!"

మొక్కుకొన్నారు అనసూయమ్మ

★ ★ ★ ★ ★ ★

సాయంత్రం నాలుగ్గంటలయేసరికి కొడుకు హుషారుగా వస్తూంటే ఆశ్చర్యపోయింది తల్లి

'రేణూ ఏదీ? వక్కడివే వస్తున్నావ్?" ప్రశ్నించారు

"రేణూవా? ఏదీ? ఎక్కడికెళ్ళింది?" కొడుకు ఆశ్చర్యంగా అడుగుతూంటే దిగ్భ్రాంతి చెందింది తల్లి తల్లి చెప్పిన సంగతులు విని కుప్పలా కూలిపోయాడు రఘు వెంటనే పోలీసులకి రిపోర్టిచ్చాడు ఆ రాత్రికి తిరిగి రాలేదు రేణు

ఆ రోజు మధ్యాహ్నం నగరపొలిమేరలు దాటుతూన్న ఓ కారులోంచి ఒక అబల ఆర్తనాదం విన్పించిందనీ, రక్షించమని కేకలు వేసిందనీ కొందరు చెప్పారు ఆ కారు పూనావైపు వెళ్ళిందన్నారు పోలీసు డిపార్టుమెంటు శక్తివంచనలేకుండా పనిచేస్తోంది

జరిగిన కథ-8: రామనాధంగారు తన కూతురి ప్రేమ వ్యవహారం చెల్లెలితో చెపుతారు అనసూయమ్మ కృంగిపోతుంది రమ రేణుని తన అన్న పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని తల్లికి సలహా ఇస్తుంది రమ పెళ్ళి చూపులు అయ్యాయి తల్లికి తెలీకుండా చంద్రశేఖర్‌కి నగలు ఇచ్చింది ఉష అవి అతను వారం రోజులు అయినా తిరిగి తెచ్చి ఇవ్వలేదు చంద్రశేఖర్ మోసగాడని తెలుసుకొని రామనాథం దంపతులు కుప్పకూలి పోయారు తన కుమారుడు రఘుబాబుని వివాహం చేసుకోమని రేణుని అడుగుతారు అనసూయమ్మ తన తల్లినీ, మామయ్యనీ ఒకసారి అడగాలని అంటుంది రేణు. రేణూ– రఘూ రమా– శశిధర్ వివాహాలు అయిపోయాయి సంవత్సరం గడిచాక కొడుకుని కని అత్తగారి కోర్కెను తీర్చింది రేణూ. రేణు పుట్టిన రోజునాడు ఉదయం శ్రీ వెంకటేశ్వరుని దర్శించుకొనేందుకు భర్తతో బిర్లా మందిర్ వెళు ంది

రేణు కనిబడ్డంలేదని రాజమండ్రిలో వున్న అత్తగారికీ, బెజవాడలో వున్న రమకీ టెలిగ్రాములు పంపాడు రఘు మర్నాడు అన్నయ్యనీ, కొడుకునీ వెంటబెట్టుకొని లబోదిబో అంటూ వచ్చింది రేణు తల్లి సరస్వతి భర్తతో బయలుదేరి వచ్చింది రమ విషయం తెల్సుకొని అంతా విచారించారు భార్యఫోటోతో న్యూస్ పేపర్లలో ప్రకటనలిచ్చాడు రఘు పదిహేను రోజులు గడిచినా ఆమె జాడ తెలీలేదు! నెలరోజులుండి నిరాశతో తిరిగి రాజమండ్రి చేరుకొంది సరస్వతి రమను అక్కడనే వదలి శశిధర్ బెజవాడ వెళ్ళాడు

రోజులు భారంగా గడుస్తున్నాయి రేణుతో గడపిన మధుర క్షణాల్ని నెమరువేసుకొంటూ ఆమె స్మృతుల్లో గడపడం తప్ప రఘుకి వేరే ధ్యాసలేదు

రమవచ్చి నెల్లాళ్ళు దాటింది ఎన్నాళ్ళని వుండగలదు! చంటివాడ్ని తనతో బెజవాడ తీసుకెళ్తానంది

'వద్దమ్మా! ఈ చంటిగుడ్డుతో పాట్లు పడలేవు! అంగీకరించలేదు తల్లి - నిరాశా నిస్పృహల్తో అత్తవారింటికి ప్రయాణమైంది రమ, తల్లి కంట తడిపెట్టుకొంటూంటే

'వారానికోసారి నేనూ మీ అల్లుడూ వస్తూ వుంటామమ్మా! నీవేమి దిగులుపడకు! ఒదిన ఎక్కడో - వుండి వుంటుంది తప్పకుండా వస్తుంది!' అధైర్యపడుతూనే తల్లికి ధైర్యం చెప్పింది రమ

★ ★ ★ ★ ★ ★

మూడు నెలలు కాలగర్భంలో కల్సిపోయాయి

అన్నయ్యా, ఒదినా, ఉషా అప్పుడప్పుడు వస్తూంటే కొంత ఊరటగా వుంటోంది అనసూయమ్మగారికి మనవణ్ణి ఎత్తుకొని తిరగడానికి ఆమెకు ఓపికలేదు

కిషోర్‌బాబుని ఎత్తుకొని ఆడించడానికి ఓ పిల్లని చూసిపెట్టొదినా!' పార్వతమ్మతో అన్నారు ఓనాడు

దానికేం భాగ్యం! మా పనిమనిషికి పదేళ్ళపిల్ల వుంది! దాన్ని పంపించమంటా! కానీ ఎంతకాలమని రఘుబాబు యిలా వుంటాడు చెప్పు! పట్టుమని పాతిక సంవత్సరాల్లేవు! రేణు జాడ యింతవరకూ తెలియ లేదంటే చెప్పబోతూ ఒదిన మొహంచూసి ఆగిపోయింది పార్వతమ్మ

నీ అభిప్రాయం అర్థమైందొదినా! రఘుబాబు మొహం చూస్తే వాడితో మాట్లాడ్డానికే భయంగా వుంది ఎప్పుడు నవ్వుతూ నవ్విస్తూ వుండేవాడు! అగ్నిపర్వతంలా వుంటున్నాడు! ఎప్పుడూ గంభీరంగా ఉంటాడు రాత్రిళ్ళు చాలా ఆలస్యంగా యింటికి వస్తాడు! భోజనానిక్కి రమ్మంటేగానీ రాడు! పలకరిస్తేగానీ మాట్లాడ్డు!

ఆవేదన వ్యక్తం చేసారు అనసూయమ్మ

'అవునొదినా! వాళ్ళ అనుబంధం అలాంటిది! భార్యను మరువలేకుండా వున్నాడు ఇలాంటి పరిస్థితుల్లోనే మగవాడికి దురభ్యాసాలలవడ్తాయి! అలవాటు పడ్డాడా మన చెయ్యి దాటిపోతాడు! పరువూ మర్యాదలు మంటలు గలుస్తాయి! అప్పుడు విచారించి ప్రయోజనంలేదు! ముందుగానే జాగ్రత్త పడాలి!'

ఒదిన మాటలకి భయపడ్డారు అనసూయమ్మ మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయారు

"వాడు మళ్ళీ మనిషి కావాలంటే ఒకటేమార్గం వుంది!" అంది పార్వతమ్మ

ఏమిటి?" ఆతృత ప్రకటించారు అనసూయమ్మ

"మళ్ళీ పెళ్ళి చేసెయ్! అంది తేలిగ్గా పార్వతమ్మ ఆమె మాట్లాడక పోవడంతో తనే అంది మళ్ళీ

వాడు మళ్ళీ పెళ్ళికి అంత సులువుగా అంగీకరించడు. నాకు తెల్సు! కానీ ఏం చేస్తాం! అది మన పెద్దల కర్తవ్యం! ఆర్నెల్లు గడిచినా ఆమె జాడ తెలీలేదు! ఆమె వంటిమీద నగలు కోసం ఏ దుర్మార్గులో ఆమెను పొట్టను బెట్టుకొన్నారని నా అనుమానం!"

'ఒంటిమీద నగలేవీ లేవమ్మా! ఒక్క పుస్తెలతాడు తప్పించి!"

"అదే చాలొదినా! దుర్మార్గులెంతపనైనా చేస్తారు! రోజూ పేపర్లో చూస్తున్నాంకదా! అర్ధణా ఎత్తు ముక్కు పుడకకోసం పసిపిల్లల గొంతును నులిపేస్తున్నారు!" అంది

రేణు చనిపోయిందనే భావం కల్గించాలని ఆమె తాపత్రయం

అనసూయమ్మ మౌనాన్ని వదల్లేదు

"ఏమైనా రఘుబాబుకింకా నూరేళ్ల జీవితం వుంది! తోడు కల్పించాలి! మనకి పెద్దకాలం వచ్చింది ఎప్పుడెలా వుంటామో!"

అదే ఆలోచనతో రోజులు గడుపుతున్నా ఒదినా! వాడి మొహం చూసి ఏమీ మాట్లాడలేకపోతున్నా!

నిట్టూర్చారు అనసూయమ్మ

★ ★ ★ ★ ★ ★



# నిశ్శబ్ద సంగీతం

"ఏమ్మా ఉషా! ఈ మధ్య రావడం మానేసావ్?"

గదిలోకి వస్తూనే మేనకోడల్ని ఆప్యాయంగా పలకరించారు అనసూయమ్మ.

"ఎక్కడకీ వెళ్ళంలేదత్తయ్యా! నీకు వంట్లో బాగుండడం లేదని అమ్మ చెప్పింది. ఇప్పుడెలావుంది?" అడిగింది ఉష అత్తయ్య పక్కనే సోఫాలో కూర్చుంటూ.

"అంతా శూన్యంగా వుంది! బతుకిలా వెళ్ళమారుస్తున్నా!" అంటూ ఉష మొహంలోకి చూసారు అనసూయమ్మ. ఆ మొహంలో కళాకాంతులులేవు. మునుపటిలా చలాకీతనంగానీ, ఉత్సాహంగానీలేవు. కళ్ళు గుంటలు పడివున్నాయ్. లంఖణాలు చేసిన దానిలా కన్పిస్తోంది.

"అలా వున్నావేం?" అడిగారు.

"ఏంలేదత్తయ్యా! మామూలుగానే వున్నాను!" ఉష తొట్రుబాటును ఆమె గమనించకపోలేదు.

"ఏమిటో! అనుకొన్నట్టుగా నీకూ రఘుబావకీ వివాహం జరిగివుంటే ఈ తిప్పలుండేవికాదు! పెళ్ళయి వాడూ పెళ్ళికాక నీవూ ఒకేలావున్నారు! మీ నాన్న ఆ మధ్య ఏదో సంబంధం చూసానన్నాడు!" అని ఆగారు. వివరాలు తెల్సినా తవ్వ బుద్ధికాలేదు.

"నేనేపెళ్ళి చేసుకోనన్నాను!" చీకాగ్గా అంది ఉష.

వెంకాయమ్మవచ్చి ఉషని పలకరించింది.

"ఉషమ్మని చూసి చాలా కాలం అయింది. బావున్నావా ఉషా!"

"బాగానే వున్నాం! అత్తయ్యకి వంట్లో బాగులేదంటే చూసిపోదామని వచ్చా!" జవాబిచ్చింది.

"అదేమిటమ్మా! మామూలుగా రాకూడదా? ఆ భగవంతుడు కుదర్చలేదు గానీ యిది నీ అత్తారిల్లు కావల్సిందేకదా! రేణమ్మలేక ఈ ఇంటి కళా కాంతులు కరువయ్యాయ్! అమ్మగారు పెద్దవారైపోయారు! మనవడ్ని ఎత్తుకొనే శక్తికూడా సన్నగిల్లింది. కోడల్ని తలచుకొంటూ ఎప్పుడూ విలపిస్తూ వుంటారు. ఇక రఘుబాబు సంగతి సరేసరి!" వెంకాయమ్మగారి గొంతు గద్గదమైంది.

ఉష మాట్లాడలేదు. గోడకివున్న వెంకటేశ్వరుని పటాన్ని చూస్తూ వుండిపోయింది.

'నువ్వైనా అప్పుడప్పుడొస్తూ వుండమ్మా! కొంతసేపయినా అత్తగారికి కాలక్షేపం అవుతుంది! ఒంటరిగా వుంటే ఏదో ఆలోచిస్తూ బాధపడుతూ వుంటారు" అంది వెంకాయమ్మ తనకు తోచిన విధంగా.

'అప్పుడప్పుడూ వస్తూవుండు ఉషా! ఏమీ తోచక పిచ్చెక్కినట్టుంటోంది." అర్థించారు అనసూయమ్మ.

అంతలో పనిపిల్ల లక్ష్మి కిషోర్‌బాబుని తీసుకొనివచ్చింది. కిషోర్ కోసం చెయ్యిచాపింది ఉష. చివాల్న ముందుకువాలి ఉష చేతుల్లోకి జారిపోయాడు కిషోర్. ఆ దృశ్యం అందర్నీ ఆశ్చర్యపరచింది. ఆకర్షించింది.

"ఉషమ్మ దగ్గరకెంత జోరుగా వెళ్ళాడో చూడండమ్మా! పాపం! తల్లను కొన్నాడు కాబోలు!" ఆశ్చర్యాన్ని ప్రకటించింది వెంకాయమ్మ.

ఆ దృశ్యం చూశాక, వెంకాయమ్మగారి మాటలు విన్నాక అనసూయమ్మ హృదయం ద్రవించింది. కళ్ళనుండి నీటి బిందువులు జలజలా రాలాయ్. కిషోర్‌ని తీసుకొని మేడమీదికి వెళ్ళింది ఉష.

కొంతసేపయాకి దిగివచ్చింది. కిషోర్‌ని అత్తయ్యకందించింది.

"నే వెళ్తానత్తయ్యా! సాయంత్రం అయింది?" అంది.

"భోజనంచేసి వెళ్ళువుగాని" అన్నారు అనసూయమ్మ.

"లేదత్తయ్యా! చీకటి పడేవేళకి యిల్లు చేరుకోకపోతే అమ్మ తిడుతుంది!" అంటూ బయలుదేరింది.

* * * * * *

"మీ అత్తయ్య అంత ఆప్యాయంగా భోజనంచేసి వెళ్ళమంటే తినకుండా ఎందుకొచ్చావే?" కూతుర్ని మందలించింది పార్వతమ్మ.

"అక్కడవున్నంత సేపూ ముళ్ళమీద వున్నట్లనిపించింది. ఆ భవంతిలో స్వేచ్ఛగా తిరగలేక పోయానమ్మా! మరికొంతసేపు అక్కడవుంటే బావ వస్తాడు! అందుకే వచ్చేసా!" అంది.

కూతురి మాటలకి విస్తుపోయింది తల్లి. నెమ్మదిగా నచ్చచెప్పొచ్చు అనుకొంది.

ఉష వాళ్ళ మేనత్తగారింటికి వెళ్ళినట్టూ, మేనత్త చూపిన ఆదరాభిమానాలనూ చిలవలూ పలవలూ అల్లి భర్తకు చెప్పింది పార్వతమ్మ ఆ రాత్రి.

"అలాగా!" అన్నారు రామనాథంగారు సాలోచనగా.

"అలాగా యిలాగా అంటే కాదండి?" అని భర్తకు దగ్గరగా చేరి-

"మన ఉషని ఎలాగైనా రఘుబాబుకిచ్చి పెళ్ళిచేయాలి" అంది.

"రఘు చేసుకొంటాడంటావా? అయినా ఏం మొహం పెట్టుకొని అడగ్గలం! వాళ్ళే కాళ్ళావేళ్ళా పడితే కాదు పొమ్మన్నాం!" అన్నారు చీకాగ్గా.

"మనం అడగొద్దండి! అలా అడిగే పరిస్థితికి మీ చెల్లెల్ని తీసుకొద్దాం!" అంది యుక్తిగా.

"అదంత సులభంగాదు పార్వతీ! ఆ మధ్య రెండుసార్లు ఆ యింటికి వెళ్ళాను! ఆ యింటి వాతావరణం ఏమీ బాగులేదు. రఘుని చూస్తే నాకెంతో బాధకల్గింది. వారంతా రేణుని మరువలేకుండా వున్నారు. చివరకు వెంకాయమ్మకూడా. ఆ మనవడు క్షణక్షణానికీ తల్లిని గుర్తుకి తెస్తున్నాడు." అన్నారు నిరాశగా.

భర్త మాటల్ని పార్వతమ్మ లెక్కచేయలేదు.

"అదంతా మీ భ్రమ! మనవడితో సాగలేక ఎన్నోపాట్లు పడుతోంది మీ చెల్లాయ్. మనవడ్ని సాకడానికి మన పనిమనిషి కూతురు లక్ష్మిని కుదిర్చాను. రఘుబాబు అసలు యింటిపట్టునే వుండటంలేదుట! ఉదయం అనగాపోయి ఏ అర్థరాత్రికో తిరిగి వస్తున్నాడుట! వాడి బతుకెక్కడ పాడైపోతుందోనని మీ చెల్లెలు బెంగపెట్టుకొంటోంది. ఇలాంటి పరిస్థితుల్లోనే మనం ప్రయత్నం చేయాలి! మీరు ఊఁ అంటే నేనే ప్రయత్నిస్తా!' అంది అనుమతి కోసం.

ఎటూ చెప్పలేక రామనాథంగారు మౌనం వహించారు. ఆ మౌనాన్ని అంగీకారంగా తీసుకొంది పార్వతమ్మ. తృప్తిపడింది.

రెండు రోజులు గడిచాయ్. రాత్రి పదకొండు గంటలైంది. భర్తకి భోజనం వడ్డిస్తోంది పార్వతమ్మ. టెలిఫోన్ మ్రోగింది. లేచివెళ్ళి అన్సరు చేసింది పార్వతమ్మ.

"వెంకాయమ్మగారా!"

"..........."

"కిషోర్‌బాబుకి గాలి చల్లిందా? చెయ్యి దిగడంలేదా? గుక్కపెట్టి ఏడుస్తున్నాడా? ఒదినక్కూడా ఒంట్లో బాగుండలేదా?"

"........"

"పనిపిల్ల లక్ష్మిని పంపమంటారా? అదెక్కడో వుంటోంది? దానిల్లు తెలీదే!



ఈ రాత్రప్పుడు ఎలా విలవుతుంది?" అని భర్త వైపు చూసింది. భర్త ఫోలో అవుతున్నట్లు గమనించింది.

"........"

"అబ్బాయి మీ దగ్గర కూడా వుండటంలేదా? పోనీ ఓ పని చేస్తాను. ఉషని పంపిస్తా! వాళ్ళ నాన్నగారు కారులో దిగబెడ్తారు?" అంటూ భర్తవైపు మరోసారి చూసింది. ఆయన సుముఖంగానే వున్నట్లు తెల్సుకొంది.

"ఓ అరగంటలో వస్తారు! అంతవరకూ ఎలాగో ఓపిక పట్టండి? రఘుబాబొచ్చాడా?"

"......"

"ఇంకా రాలేదా? వచ్చినా వాడు ఏం చేయగలడు? ఉషని పంపిస్తున్నా!"

అంటూ రిసీవర్ను పెట్టింది పార్వతమ్మ.

"కిషోర్‌కి గాలి చల్లిందట.... ఒకటే ఏడుపు; చెయ్యి దిగడంలేదుట! మీ చెల్లెల్కి కూడా బావులేదట! భర్తతో మరోసారి చెప్పింది.

"ఉషని పంపిస్తానన్నావుగా!" అన్నారు.

"అయిన వాళ్ళం మనం ఆదుకోబోతే ఎలా? ఒకసారి వెళ్ళి ఉషని దిగబెట్టి మీ చెల్లెల్ని కూడా చూసిరండి!" అంది.

* * * * * *

కిషోర్‌ని బుజాన వేసుకొని అటూ యిటూ పచార్లు చేస్తున్న వెంకాయమ్మ గేటు ముందు కారాగిన చప్పుడు విని అటు చూసింది. ఉషనీ ఆమె తండ్రినీ చూసాక మనసుకుదుటపడింది.

"అన్నయ్యగారూ ఉషమ్మా వస్తున్నారమ్మా!" అనసూయమ్మతో చెప్పింది.

చెల్లెలు లేచి కూర్చోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూంటే వారించారు రామనాథంగారు.

'లేవద్దు! పడుకో! వంట్లో ఎలావుంది?" పక్కనే కూర్చుని ప్రశ్నించారు రామనాథంగారు.

'ఏమిటో అన్నయ్యా! లేచి తిరగలేను! కిషోర్‌కి గాలిజల్లింది! చెయ్యి దిగడంలేదు! మూడు రోజుల నుంచి పట్టిన జ్వరం వదల్లేదు. నేనెత్తుకోలేను. వెంకాయమ్మ దగ్గరుండదు!"

ఆయాసపడుతూ చెప్పారు అనసూయమ్మ.

ఉష ఎత్తుకోగానే బాబు ఏడుపు మానేయడం అందరికీ ఆశ్చర్యాన్ని కల్గించింది.

'వాళ్ళమ్మనుకొంటున్నాడేమో?' పైకే అనేసారు రామనాథంగారు.

నిట్టూర్పు విడిచారు అనసూయమ్మ.

"ఈవేళ రఘుబాబు రావడం ఆలస్యం అయినట్టుంది!" అన్నారు రామనాథంగారు.

"వాడీమధ్య బాగా ఆలస్యంగానే వస్తున్నాడు"

నిస్తేజంగా వచ్చాయి మాటలు–

"ఇంత ఆలస్యం అవుతోందేం బాబూ!" అని అమ్మగారు చాలాసార్లు అడిగారండి......" అని ఆగింది వెంకాయమ్మ. ఆమెవైపు ఆత్రంగా చూసారు తండ్రీ కూతుళ్ళిద్దరూ.

"ఇంటికివస్తే ఏం తోస్తుందమ్మా! అలా తిరిగి తిరిగి అలిసాక ఆకలేసాక యింటికి రావాలనిపిస్తుంది అని అంటారు బాబు! వారి మొహం చూసాక యింకేమి అడగాలనిపించదు!" పూర్తి చేసింది వెంకాయమ్మ.

"వెర్రి నాగన్న! వాణ్ణేమీ అనలేక పోతున్నానన్నయ్యా! తనను ఎల్లవేళలా గుర్తు చేసుకోమని శేఖర్ని మా కప్పగించి వెళ్ళింది! రేణుని మరువలేకుండా వున్నాం!"

వాపోయారు అనసూయమ్మ.

"నిజమే మరి! చిన్నతనంలోనే భార్యావియోగం సంప్రాప్తమైంది! అలాగని వాణ్ణలా వదిలేస్తే ఎలా! వాణ్ణి ఏదో విధంగా దారిలోకి తీసుకురావాలి! తిరిగి మనిషిని చెయ్యాలి! ఆ సంగతి తర్వాత ఆలోచిద్దాం! నువ్ నిశ్చింతగా వుండు! రఘుబాబుని దారిలోకి తెచ్చే పూచీ నాది!"

చెల్లెలికి భరోసా యిచ్చారు రామనాథంగారు. కొంత ఓదార్పు పొందారు అనసూయమ్మ. (ఇంకా ఉంది)




కె. వి. ఆర్. – రాజమండ్రి

ఆడవాళ్ళకు "కేన్సర్" కంటియందు గూడా వస్తుందని చెప్పారు. అలా వచ్చినపుడు కలుగు లక్షణాలేమిటి?

ఆడవాళ్ళకు మాత్రమే కళ్ళకి కేన్సర్ వస్తుందని ఎవరు చెప్పారు? దృష్టి మాంద్యము, నెప్పి, పుసులు కట్టడం, కళ్ళలో ఎరుపు, కనుగ్రుడ్డు ముందుకు చొచ్చుకు రావటం మొదలయినవి కళ్ళలో కేన్సర్ ఉన్నప్పుడు కనబడగల కొన్ని లక్షణాలు.

ఎమ్. కె. ఎన్. – పామర్రు

నాకు తరచుగా కాళ్ళ పిక్కల మీద, తొడల మీద, చివరకు చెవుల వరకూ విపరీతమైన దురద పుట్టుచున్నది. ఎంత ప్రయత్నించినా గోకకుండా వుండలేక పోతున్నాను. గోకితే పుళ్ళుగా మారి ఆ భాగములు వాచిపోయి జ్వరము గూడ వచ్చుచున్నది. డాక్టర్ గారు "ఎలర్జీ" అని చెప్పారు. ఈ వ్యాధి రావటానికి కారణ మేమిటి? దీనికి నివారణ ఏమిటి? నాకు కొద్దిగా షుగర్ వున్నది.

రక్తంలోని గ్లూకోజు ప్రమాణాన్ననుసరించి వైద్యుల పర్యవేక్షణలో మాత్రలు వాడటం మంచిది. రక్తంలోని గ్లూకోజు ప్రమాణం తగ్గకుండా దురదలు తగ్గక పోవచ్చును.

ఆర్. పి. ఆర్. – వరంగల్

నా వయస్సు 32 సం.లు. నాకు వివాహమై 5 సం.లు అయింది. ఇంతవరకు సంతానం లేదు. రతిలో మా యిద్దరికి పూర్తి సంతృప్తి ఉంటుంది. సమస్య ఏమిటంటే టిస్యుకి సరిపోయేటంత వీర్యం బయటికి రావటం లేదు. ఒకటి, రెండు పల్చటి చుక్కలు వస్తాయి. ఒక్కొసారి అవీ రావు. బయటికి రాకుండా ఏదో అడ్డుకుంటున్నదని నా అనుమానం. తర్వాత మూత్ర విసర్జనలో బయటికి పోతున్నట్లు అనిపిస్తున్నది. నేను పూర్తి ఆరోగ్యంగా ఉంటాను.

ఆలో గో జూస్పెర్మియా అనబడే ఈ లక్షణం కొందరిలో ఉంటుంది. మీరు ఆయుర్వేద వైద్యులను కలుసుకొని వారి సలహా పొందండి.

కె. పి. – ఖమ్మం

నేను 1980లో ఎం. ఎ. ఎకనామిక్స్ చదివాను. మొదటి నుండి నాకు ఫస్టు క్లాసే. ఒక మిత్రుని సలహా ప్రకారం జ్ఞాపక శక్తి అధికం అవటానికి కొన్ని మాత్రలు వాడాను. ఇప్పుడు కొన్ని సైడు ఎఫెక్ట్లు వచ్చినవి. ఉదాహరణకి కాఫీ హొటల్‌కి వెళ్ళినప్పుడు సప్లయర్ ఇంకొకరితో మాట్లాడుతూ ఉన్నా నేను మధ్యలో నాకు కావలిసిన అయిటమ్స్ చెప్పబోతాను. తర్వాత బాధపడతాను. ఇలా నిత్య జీవితంలో చాలా జరుగుతున్నాయి.

మీరు సైకియాట్రిస్టులను కలిసి మీ మానసిక వ్యధను పోగొట్టు కోవటం మంచిది. ఆ మాత్రల ప్రభావం ఇంకా ఉండదు. ఏదో తప్పు చేసామనే భావనే మిమ్ములను బాధిస్తున్నదని నా అనుమానం! □

# కొన్ని కథలింతే!

## జి. నరసింహమూర్తి

వ్యవహారమెటూ తేలకుండా ఉంది.

సీతమ్మ కూతురు పెళ్ళిచూపుల కొచ్చిన పెద్దలు ఆలోచనలో పడ్డారు.

అమ్మాయి అందమైంది. చదువుకున్నది. బి యిడి పాసై ఉంది. ఇల్లూ వాకిలీ అంతంత మాత్రమైనా వాటి గొడవ మగపెళ్ళి వారికనవసరమే. అబ్బాయి ఇల్లరికం రానవసరంలేదు. రావాలన్న కోరిక లేదు.

పొద్దున్న వచ్చిన పెళ్ళి పెద్దలు అటు వెళ్తున్నారు; యిటు వెళ్తున్నారు - సీతమ్మ యెప్పుడో పదహారు సంవత్సరాల క్రితం భర్తతో సంబంధాలు తెంచుకున్న ఆడది. కారణాలు యేమైనా భర్తను వదిలేసిందే అంటారు. గాని భర్త ఆమెను తన తోవన తాను వదిలి పోయాడని విశాలంగా ఆలోచించే వారుండరు.



పెద్దలు దీని వెనుకున్న రహస్యం మరింత బయటకు లాగాలని ఆ వీధి యీ వీధి ఆచూకి తీస్తున్నారు. సీతమ్మ గురించి, ఆమె కూతురు గురించీనూ.

అమ్మాయిని చూస్తుంటే సంబంధం చూస్తూ వదులుకోలేక పోతున్నారు. తల్లి కూడా అణుకవైనది. మర్యాద సంస్కారం గలది.

పెళ్ళిచూపుల కొచ్చిన నలుగురు మనుష్యులు వీధి చివర తారసపడిన ఓ వ్యక్తిని ఆపారు.

"మిమ్మల్ని ఆపినందుకు క్షమించాలి."

"ఫర్వాలేదు, చెప్పండి"

"ఆ పై వీధిలో సీతమ్మనే ఓ మొగుడు లేనావిడ ఉంటుంది. ఏటువంటిది?" ఒకాయన ప్రశ్నించాడు.

"చాలా మంచిది."

"మరి మొగుడు యెందుకు వదిలేశాడు?"

"ఆవిడది కాదు తప్పు - ఆమె మొగుడిదే"

"వాళ్ళకింకెవరూ లేరాండి?"

"ఉన్నవాళ్ళంతా మన వాళ్ళవుతారా, మన వాళ్ళంతా ఉన్నవాళ్ళవుతారా - యెవరి తోవలు వారివి"

ఈ సమాధానంతో ఆ పెద్ద మనుషుల తల తిరిగిపోయింది. అతను చెప్పిన సమాధానం చాలా లోతుగా ఆలోచించాల్సిందే అనుమానాలు నివృత్తి చేసుకుని వచ్చిన పని నెరవేర్చుకు పోవాలని పెద్దలు కంగారు పడుతున్నారు.

"పని తొందర్లో ఉన్నట్టున్నారు. వెళ్ళి రండి" అన్నాడు అందులో ఓ పెద్ద.

"దానికేముందిలెండి. నమస్తే" వెళ్ళిపోయాడు ఆ ఆసామి.

అతనలా వెళ్తుండగానే మరో వ్యక్తి అలా రావడంతో,

"చూడండి బాబూ! ఆ పై వీధిలో సీతమ్మగారు, అంటే - ఒకర్తే కూతుర్తో ఉంటుంది మొగుడు లేకుండా - ఆమె మొగుడు యెక్కడుంటున్నాడు?" ప్రశ్నించాడు.

ఆ వ్యక్తి మందహాసం చేసి "భలేగడుగుతున్నారు. యిప్పటిదాకా మీరు మాట్లాడారు, అంటే అదిగో ఆ వెళ్తున్నాయనే సీతమ్మగారి భర్త" అంటూ వెళ్తున్నాయన్ని చూపించాడు.

పెద్దలకు మతి పోయింది.

ఎవరి కోసం వెదుకుతున్నారో ఆ వ్యక్తినే అసలు విషయం ఆరా తీయడంకూడా జరిగిపోయింది.

"ఈయన యెక్కడుంటున్నాడు?"

"ఈ పక్క వీధిలోనే"

"మరి ఆవిడకూ ఈయనకూ యేసంబంధమూ లేదా?"

"వాళ్ళు విడిపోయి చాలా సంవత్సరాలయ్యింది. ఎవరి బ్రతుకులు వాళ్ళవి. ఈయన మరో సంసారం పెట్టుకున్నాడు. పిల్లలు కూడాను. వాళ్ళను పెంచుకుంటూ యేదో తన గొడవ తాను చూసుకుంటాడు. ఒక విధంగా చెప్పాలంటే స్వయంశక్తి మీద ఓ చిన్ని ఉద్యోగం చేసుకుంటూ కూతుర్ని బి.ఇ.డి. చదివించింది. ఈయన గారికంటే ఆమే ఓ స్థాయికొచ్చింది సంఘంలో" అన్నాడు.

పెద్దలు మరేమీ అడగలేదు.

వివాహం నిశ్చయమైపోయింది.

# గెలవండి! రూ 20,000/-ల విలువైన బహుమతులు!



## కలువబాల చందాదారులకు లక్కీడిప్:
## ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

రు 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది అదీగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు "చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా కలువబాల కు ఏడాది చందాదారులుగా చేరడమే! కాకపోతే మీ చందా సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక చిరుకానుక కాలక్రమంలో అందుతుంది

మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు



**కలువబాల**
నవ వనితా పక్షపత్రిక

## కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1 చందా పైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును
2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి
3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును
4 చందా పైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును
5 ఎమ్ ఒ లు డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు
6 కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు
7 కూపన్‌మీద మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు చిరునామా స్పష్టంగా పూర్తిగా వ్రాయాలి వారు ఇదివరకే చందాదారులైతే కూడా వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును డి డి లు ఆంధ్రపత్రిక- విజయవాడ-3 పేర తీసుకొని పంపించాలి

--- కత్తిరించాలి ---



నిజమయితే ✓
కాకపోతే X
అని గుర్తుపెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు ..........................................

..........................................

చిరునామా ..........................................

..........................................

..........................................

ఎమ్ ఒ పంపిన తేదీ ..........................................

లేదా

**డి డి జత చేయడమైనది**

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది

కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:

కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి

9 ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము

గమనిక ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము .

10 ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు

# ఇ॰వేమన॰పద్యాలు

బావిలో స్నానం చెయ్యటం మంచిదికాదని చెబితే—
పోరా! ఎవడిక్కావాలి నీ బోడి సలహా అన్నాడు!...



స్నాన మొనరజేసి దానంబు సల్పక
నీళ్ల మునుగ దగునె నేర్పులేక
నీళ్లయందు గాకి నెలవుగా మునుగదా
విశ్వదాభిరామ వినుర వేమ.

సీతమ్మ ఆ వివాహం తన యింటనే జరిపించాల్సిందిగా కోతే మగపెళ్లివారు కాదనలేదు.

ఒక్క కూతురు పెళ్లి తన యింటే జరిగితే తద్వారా కలిగే సంతోషం కోసం ఆమె తపిస్తుందని గమనించారు!

అబ్బాయి కూడ యోగ్యుడు కావడం వలననూ అర్థం చేసుకోగలవాడు కనుకనూ పెళ్లి వ్యవహారం సవ్యంగానే సాగిపోయింది.

కట్న కానుకల విషయంలో పట్టింపుల్లేవు. చాలా సుహృద్భావంతో పెళ్లి కార్యక్రమాలు నడుస్తున్నాయి.

మగపెళ్లివారు వచ్చారు.

పెళ్లిపందిరి కలకల్లాడుతోంది.

సీతమ్మ ఒకర్తే అయినా సమర్ధురాలు కనుక విందులూ, వడ్డింపులూ, మర్యాదలూ అన్నీ సక్రమంగా పర్యవేక్షిస్తోంది.

## కొన్ని కథలింతే!

ఆడది అంత చాకచక్యంగా కూతురి వివాహం నెరవేర్చుతున్నందుకు అందరికీ ఆశ్చర్యంగా ఉంది.

ముహూర్తం రాత్రి తొమ్మిది నలభై నిముషాలకు.

వధూవరులు పెళ్లి పీటల మీద కూర్చున్నారు.

పురోహితుడు ఘనంగా నెరవేర్చుతున్నాడు తన బాధ్యత.

పందింట్లో కూర్చున్న బంధుమిత్రులంతా ఉత్సాహంగా ఉన్నారు. అయినా తండ్రి లేని లత వివాహమిలా సాగుతున్నందుకు లోలోన సానుభూతి గాయం నుంచి స్రవిస్తున్న నెత్తురులా ఉంది.

ఎవరో అన్నారు సీతమ్మతో - "ఏమ్మా కన్నవాడు యిక్కడే ఉంటున్నాడుగా - పెళ్లికి పిలవకూడదూ?" అని.

"పిల్ల రెండో యేటనే మమ్మల్ని వదిలేసి వెళ్లిపోయిన ఆ మనిషిని పెళ్లికి రమ్మనడమెందుకు, రాక పోయిన తర్వాత మళ్లీ ఆ చెంప దెబ్బ తినడమెందుకు - ఆ గతాన్నంతా మళ్లీ కెలుక్కోవడమెందుకు" సీతమ్మ తనలోనే అనుకుంది.

"ముహూర్తం దగ్గర పడుతుంది.కన్యాదాత ఇలా రండి. త్వరగా రావాలి" అంటూ మంత్రాలు వల్లిస్తూ తాళి వగైరా తయారు చేస్తున్నాడు పురోహితుడు.

ఉన్నట్టుండి ఓ వ్యక్తి ముందుకొచ్చాడు.

అతను తిన్నగా లత పక్కగా నిలబడ్డాడు.

సీతమ్మ కూడా అక్కడే ఉంది.

అతనూ, సీతమ్మా పక్క పక్కనే ఉన్నారు.

పెళ్లి పందింట్లో కల కలం లేచింది.

సీతమ్మ అతని కళ్లల్లోకి చూసింది.

ఏవో స్వచ్ఛమైన భావలున్న ఆ చూపుల్లో చూపులు కలిశాయి.

"రామ్మూర్తిగారు - కూతురి పెళ్లికొచ్చారు" అంటున్నారెవరో.

"ఆహా యెంత శుభ ఘడియంది"

"కన్న కూతురే కదా"

"అవును. ఆ మమతానుబంధం అలా లాక్కొస్తుంది"

ఇలా అనుకుంటున్నారు.

పురోహితుడు తలంబ్రాల పళ్లెలు పందింట్లోకి పంపించేడు. అంతా సంతోషంగా తలంబ్రాలు గుప్పెట్లోకి తీసుకున్నారు! సీతమ్మ వెలితి గుండె అమృతంతో నిండిపోయింది. అనుకోకుండా ఆ పవిత్రక్షణం వెల్లివిరిసి పుష్పించింది.

"మీరు పెళ్లి కుమార్తెకు ఏమవుతారు?" పురోహితుడు అడిగేడు.

"తండ్రిని".

సీతమ్మకది చాలు.

కన్యాదానం చేయించాడు.

మాంగల్య ధారణ తాళమేళాల మధ్య బ్రహ్మాండంగా ముగిసింది.

తలంబ్రాలు పుష్పవర్షంలా కురిశాయి.

తతిమ్మా పెళ్లి కార్యక్రమాలు ముగిశాయి.

రామ్మూర్తి వధూవరుల నాశీర్వదించాడు అక్షంతలు వేసి.

సీతమ్మ నయనాల్లో ఆనందభాష్పాలు నిండాయి.

రామ్మూర్తి అక్కన్నుంచి వెళ్లిపోయే ఉద్దేశంతో పందిట్లోంచి బయటకొచ్చాడు.

సీతమ్మ కూడ బయటకొచ్చింది.

రామ్మూర్తి మౌనంగా ఉండిపోయాడు.

ఇద్దరి మధ్యా మాటల్లేవు.

"ఇలా వచ్చినందుకు నన్ను మన్నించు సీతా! మనిద్దరమూ యేనాడో విడిపోయినా మనిద్దరి మధ్యా ఆనాటి ప్రేమానురాగాలకు గురుతుగా లత ఉంది. లత నా కూతురే కనుక ఈ శుభ సమయంలో నేను రావడం పొరపాటు లేదనుకుంటాను" రామ్మూర్తి ముందుకి నడిచాడు. □

# "శ్రీ అన్నవర దేవాలయం"

దక్షిణ భారతదేశంలో జగత్ ప్రసిద్ధి గాంచిన గిరిక్షేత్రాలు చాల వున్నాయి. అందులో శేషాచలం, శ్రీశైలం, రత్నగిరి, సింహాద్రి, భద్రగిరి,యాదగిరి మొదలగునవి ముఖ్యమైనవి. ఇందులో తూర్పు గోదావరి జిల్లాలో. అన్నవరం రైల్వే స్టేషనుకు 2 కి. మి. దూరంలో పడమటి వైపుగా, పంపానది తీరాన రత్నగిరి పై అన్నవర క్షేత్రం నిత్యవసంత శోభలను విరజిమ్ముతుంది.

ఓ చిన్న చిట్టడవి పవిత్రక్షేత్రంగా మారటం, ఒక చిన్నమెట్ట 'రత్నాద్రి' గాపేరు మోయటం, అతి చిన్న గ్రామం 'అన్నవరం' సప్తనగరాలకు సాటి కావటం, ఒక సెలయేరు 'పంపానది'గా ప్రసిద్ధి చెందటం, ఈ దేవాలయమ్ము ఎప్పుడూ భక్తులతో, స్త్రీ, పురుష యాత్రిక సందోహంతో నిత్య కళ్యాణంగా విరాజిల్లటం ఆ ప్రాంత ప్రజలు చేసుకొన్న మహాపుణ్యం.

రత్నగిరి పై వున్న అన్నవర దేవాలయాన్ని చేరుకోవటానికి రెండు మార్గాలు వున్నాయి. ఒకటి మెట్లతో కాలిబాట కొరకు నిర్మించినది. రెండవది బస్సు మార్గం. బస్సు పోయే మార్గానికి ముఖ ద్వారంలో కుడివైపున శ్రీ నేరేళ్ళమ్మ వారి ఆలయం, ఎడమ వైపున వినాయకుడి గుడి వున్నాయి. నడిచి వెళ్ళే మార్గంలో పైకి ఎక్కగానే దేవాలయాన్ని సమీపిస్తుండగా ఓ ముఖద్వారం వస్తుంది. ఇది శిల్పాలతో ఎంతో చూడ ముచ్చటగా వుంటుంది. ఎడమవైపున విఘ్నేశ్వరుడు, కుడి వైపున సత్యనారాయణ స్వామి , ఈశ్వరుడు మరియు అనంత లక్ష్మి, మధ్య భాగాన స్వామి వారి ఉపనయనం, వ్రతం, వివాహం చూపరులను ముగ్ధులను చేసే విధంగా వున్నాయి.

## రత్నగిరి 'అన్నవరంగా' ఎలా మారింది?

భక్తులకు ఇమ్మన్న వరాలిస్తుంది కాబట్టి రత్నగిరి 'అన్నవరం'గా పిలువ బడిందని కొందరి అభిప్రాయం. అయితే చారిత్రకంగా 'అన్నవరం' అనే పేరు మరోరకంగా వచ్చింది. రెడ్డి రాజుల పాలనా కాలంలో రత్నగిరికి సమీపంలో వున్న 'బెండపూడి' దుర్గాన్ని 'అన్నయ మంత్రి' పాలించే వాడట. ఇతడు ద్రాక్షారామ భీమేశ్వరాలయంలో తూర్పు గోపురాన్ని కట్టించాడు. ఇతని పేరుతో బెండపూడి సమీపంలో వున్న ఈ గ్రామానికి 'అన్నవరం' పేరు వచ్చిందని కొందరి చరిత్రకారుల అభిప్రాయం.

## రత్నగిరి స్థల పురాణం

పౌరాణిక గాథ ప్రకారం, పూర్వం పర్వత ప్రభువైన 'మేరువు' సంతానం కావాలనే ఉద్దేశ్యంతో బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడట. ప్రజాపతి ప్రత్యక్షమై పుత్ర ప్రాప్తిని ప్రసాదించాడు. ఇద్దరు కుమారులు జన్మించగా, పెద్దవాడి పేరు 'భద్రుడు' అని, చిన్నవాడి పేరు 'రత్నాకరుడు' అని నామకరణం చేశాడట. పెద్ద వాడైన భద్రుడు శ్రీరామ చంద్రుని అనుగ్రహం పొంది, తాను భద్రగిరిగా మారి, తన శిరస్సు మీద శ్రీరామ చంద్రున్ని ధరించేటట్లుగా, తన పేరుతో భద్రాచలం పుణ్యక్షేత్రం అయ్యేటట్లుగా వరం పొందాడట. అలాగే చిన్నవాడైన రత్నాకరుడు కూడా విష్ణువు అనుగ్రహం పొంది, వరాన్ని పొందుతాడు. నాటి నుండి రత్నాకరుడు కూడా విష్ణువు అనుగ్రహం పొంది, వరాన్ని పొందుతాడు. నాటి నుండి రత్నాకరుడు 'రత్నగిరి'గా వెలవగా, విష్ణువు, అనంతలక్ష్మి,



రాజగోపురం

సత్యవతీదేవి సమేతుడై శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి నామధేయంతో ఆవిర్భవించాడట.

## శ్రీ యంత్రాలయం

శ్రీ స్వామివారి దేవస్థానం రెండు అంతస్థులుగా వుంటుంది. క్రింది భాగంలో యంత్ర ప్రతిష్ఠ జరిగింది. దానిని 'శ్రీ యంత్రాలయం' అంటారు. స్వామి వారి దివ్య మంగళ మూర్తిని పై అంతస్థులో చూడవచ్చు. క్రింది భాగంలో రెండు గదులు దాటిన తర్వాత ప్రధాన యంత్రాలయం వస్తుంది. ద్వారాలు 5 అడుగుల 8 అంగుళాల ఎత్తుతో. పూర్తిగా వెండితో తయారు చేయబడ్డాయి. ఈ ఆలయానికి ఆగ్నేయ భాగంలో మహాగణాధిపతి, నైరుతీ దిక్కున శ్రీ సూర్య నారాయణ స్వామి , వాయువ్యాన బాల త్రిపుర సుందరి దేవి, ఈశాన్యాన ఈశ్వరుడు చూడ ముచ్చటగా వున్నారు.

శ్రీ యంత్రాలయంలో ఓ దిమ్మె మీద బింధుస్థానాన ఏకశిలా స్తంభం వుంటుంది. అది ఓ వృత్తాకారమైన శిల మీద నిర్మించబడి వుంటుంది. అది పై మేడ వరకు ఆక్రమించి వుంటుంది. అంటే పై అంతస్థుకు క్రింది అంతస్థుకు మధ్య పానవట్టం వంటి నిర్మాణము కలదు. అందు త్రి పీఠముల మీద బీజాక్షర సంపుటి యంత్రం కలదు. త్రిపీఠంపై నిర్మించబడ్డ ఆదిలోని వృత్తాకారం శిల బ్రహ్మ స్వరూపమని , మధ్యన వున్న లింగాకార స్తంభం శివ స్వరూపమని, పై భాగమందలి విగ్రహం నారాయణ స్వరూపమని, ఈ విధంగా సృష్టి, స్థితి, లయకారకులైన త్రిమూర్తులు ఒకే శిలలో వెలసినారని, ప్రాజ్ఞులు, భక్తులు అభివర్ణిస్తారు. ఈ విధమైన నిర్మాణం ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడా లేదు. ఒక్క అన్నవరంలోనే ఒకే రాయిలో హరి, హర, బ్రహ్మాదులు చెక్కబడ్డారు.

శ్రీ యంత్రాలయం నాల్గు వైపుల నాలుగు

అన్నవర దేవాలయ ముఖద్వారం



స్తంభాలతో నాలుగు ద్వారాలతో నిర్మించబడి వుంది. స్తంభాలు సిమెంట్ ప్లాస్టర్ చేయబడ్డాయి. దీనికి ఎదురుగా ఓ ధ్వజ స్తంభం వుంది. అది కూడా పూర్తిగా వెండి తొడుగుతో చేయబడింది. యంత్రాలయం చుట్టూ దశావతారాలు, ఈశ్వరుడు, సూర్యనారాయణ, గణపతి– మొదలగు బొమ్మలు కూడా కలవు.

## స్వామి ప్రధాన ఆలయం

పై అంతస్థులో వున్నటువంటిదే విష్ణువు స్వరూపం. దానినే 'వీర వేంకట సత్యనారాయణ స్వామి' అని అంటారు. స్వామి వారి నామధేయానికి ఎంతో గొప్పగా అర్థం చెప్పబడింది. 'వీర' అంటే విక్రమశాలి అని అర్థం. 'వేంకట' అంటే పాపాలు పోగొట్టేవాడు. 'సత్య' అనే పదం పరమాత్మ వాచకం. ఇక 'నారాయణ' అంటే నరుడు అని అర్థం. నరుడు అనగా ఆత్మ నుండి ఉద్భవించిన ఆకాశాదులు నారములు. నారములు కావ్య రూపాలు.

గర్భ గుడిలో గల ఈ స్వామికి ఎడమ పార్శ్వమున అనంతలక్ష్మీ, కుడి వైపున ఈశ్వరుడు ప్రతిష్ఠితమై వుంటారు. విగ్రహాలన్నీ వెండితో తయారు చేయబడ్డాయి. రథాకారంలో నిర్మించ బడ్డ డిజైన్‌లో స్వామి వారి విగ్రహం కలదు. స్వామి తలపై గొడుగు లాంటిది, ఈశ్వరునిపై పాము, అమ్మ వారిపై కిరీటం వున్నాయి. గర్భ గుడి దీర్ఘ చతురస్రాకారంలో నిర్మించబడింది. దీనికి మూడు ద్వారాలు వున్నాయి. తలుపులు వెండి పూతతో తయారు చేయబడ్డాయి. ఈ గర్భ గుడిలో మొదటి గదిలో ఎడమ వైపున కళ్యాణ మూర్తుల విగ్రహాలు అద్దాల పెట్టెలో చూడ ముచ్చటగా వున్నాయి. గర్భగుడి చుట్టూ నాలుగు చిన్న చిన్న గోపురాలు వున్నాయి. వాటి మధ్యన గర్భ గుడి గోపురం కనుల కింపుగా కన్పిస్తుంది. దీని ఎదురుగా రాజ గోపురం నిర్మించబడి వుంది. పైకి వచ్చిన యాత్రికులు దీని ద్వారా క్రిందికి దిగి వెళతారు.

## అద్దాల మంటపం

ఇది నాలుగు స్తంభాలతో నిర్మించబడి వుంది. చతురస్రాకారంలో వుంటుంది. లోనికి యాత్రికులకు ప్రవేశం లేదు. బయట నుండి లోపలి భాగాన్నంతా తిలకించవచ్చు. రంగు రంగు పూసలతో, పెళ్ళి పందిరి వలె అలంకరించిన స్వామి వారి ఊయల ఎంతో మనోహరంగా వుంటుంది. ఇది పూర్తిగా చెక్కతో తయారు చేయబడింది.

## ఫలభా యంత్రం

శ్రీ స్వామి వారి ఆశ్రయం ఎదుట వున్న మండపానికి ఎడమవైపు ఉత్తరాన ఒక యంత్రం నిర్మాణం వుంది. ఇది యాత్రికులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతుంది. దీనిని 'సన్‌డయల్' అంటారు. అంటే 'ఎండ గడియారం' అన్నమాట. దీనినే 'ఫలభా యంత్రం' అని కూడా అంటారు. ఈ యంత్రాన్ని 1943 జూలై నెలలో నిర్మించటం జరిగింది. 1958 సంవత్సరంలో రాజమహేంద్రవరం వాస్తవ్యులైన



"సన్‌డయల్" "లేదా" "ఎండ గడియారం"

దైవజ్ఞ సార్వభౌమ బ్రహ్మశ్రీ పిదవర్తి కృష్ణశాస్త్రి గారు దీనిని తిరిగి తెల్లని పాలరాతితో పునః నిర్మించారు. ఇది ఢిల్లీ లోని 'జంతర్ మంతర్'ను పోలి వుంటుంది. పగటి వేళ సూర్యుని నీడ ఆధారంగా కాల నిర్ణయం చేయవచ్చు. నీడ ఏ అంకె మీద పడుతుందో అప్పుడు మన గడియారంలో కూడా ముళ్ళు అదే అంకెపై వుంటాయి. అయితే యంత్రం పై చూపబడిన విధంగా, నిమిషాలను కలుప వలసినచో కలుపుట, తీసి వేయ వలసినచో తీసి వేయుట చెయాలి. అప్పుడు మధ్యమ కాలం వస్తుంది. అదే సరైన టైమ్. నిజంగా ఇది ఒక అద్భుత వాస్తు శిల్పకళాతునక.

ఇక్కడి నుండి అలా ఒక్కసారి దృష్టి సారిస్తే పంపానది చిన్న చిన్న కొండలతో, పచ్చని చెట్లతో, అలల తాకిడికి కదిలాడుతున్న నీటితో ఎంతో మనోహరంగా, ఆహ్లాదకరంగా కన్పిస్తుంది. వాల్మీకి రామాయణమున అరణ్య కాండలో పంపానది ప్రశస్తి ఎంతో గొప్పగా వర్ణించబడటం విశేషం. శ్రీరాముడు వనవాస కాలంలో ఈ పంపానది ప్రాంతాన్నే సంచారం చేశాడు.

## రామాలయం

కాలినడకతో మెట్ల ద్వారా వెళ్ళగానే ముఖ ద్వారం వస్తుంది. దానిని దాటగానే మనం ముందుగా దర్శించేది రామాలయం. ఇది కళ్యాణ మంటపంతో అంతరాలయంతో, గర్భగుడితో ఎంతో అందంగా వుంటుంది. దీనిని శ్రీ రాజా రామ్ కుమార్ బహదూర్ నిర్మించాడు.

కళ్యాణ మంటపం 16 స్తంభాలతో చూడ ముచ్చటగా వుంది. గర్భాలయంలో సీతారాముల విగ్రహాలు ఎంతో అందంగా తీర్చి దిద్దబడ్డాయి. గర్భ గుడి చతురస్రాకారంలో నిర్మించబడి వుంది. భద్రాచలంలో మాదిరిగా రాముని తొడమీద సీత కూర్చొని వుంటుంది. ఈ గుడి పై భాగం సిమెంట్‌తో పూత పూయబడింది. ఈ దేవాలయ తలుపులు టేకు కర్రతో, రక రకాల డిజైన్లతో తయారు చేయబడ్డాయి. దీని ఎదురుగా ఆంజనేయుని గుడి ఒకటి వుంది. రామాలయానికి దక్షిణాన వ్రత మండపం (గోమండపం) కలదు. దీని లోపలి గోడలపై స్వామికి సంబంధించిన చిత్రాలను రంగు రంగులతో చిత్రించటం జరిగింది. ఈ ఆలయానికి ముందు భాగాన స్వామి కళ్యాణ మండపం కలదు. దీనికి కుడి వైపున శ్రీ రాజ వేంకట రామ రాయ కళామందిరం కలదు.

శ్రీ స్వామి వారికి దివ్య కళ్యాణోత్సవాలు జరగటం విశేషం. శుద్ధ దశమి, ఏకాదశి, త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమి, శ్రావణ మాసం, ఆశ్వయుజమాసం, కార్తీకమాసం. సందర్భంగా స్వామి వారికి సంబంధించి రక రకాల ఉత్సవాలు వైభవంగా జరగటం గమనార్హం.

ఫోటోలు – వ్యాసం:
–చేగిరెడ్డి సత్యనారాయణ రెడ్డి.



రత్నగిరిపై ఉన్న అన్నవర క్షేత్రం

# ఆంతర్యం

డాక్టర్ డి.వి. సత్యనారాయణ

"సుందరి ప్లీజ్! ఈ ఒక్కసారి ఒప్పుకోవూ!"

"అబ్బ.... నన్ను విసిగించకండీ.... అసలే నాకు ఓపిక లేదు. దీనికి తోడు ఈ ముదనష్టపు ఎండలు...."

"అంతేనంటావా? ఆఖరిసారిగా అడుగుతున్నాను...."

"అంతే.... అంతే.... అంతే...." విసుగ్గా జవాబు ఇచ్చింది.

సుందరి – సుబ్బారావులకు పెళ్ళయి ఆరు నెలలు అయింది. సుబ్బారావుది రాయలసీమలోని "గిద్దలూరు" దగ్గర ఒక పల్లెటూరు. అతనికి గుంటూరులోని వైశ్యాబ్యాంక్‌లో ఉద్యోగం. సుందరిది కూడా గుంటూరునే! సుబ్బారావు మిగతా అన్నలు ఆ పల్లెలో వ్యవసాయం చేసుకుంటూ, ఉమ్మడి కుటుంబంగా ఉంటున్నారు. ఆ ఇంట్లో చదువుకున్నదీ, ఉద్యోగం చేస్తున్నదీ సుబ్బారావు ఒకడే! గుంటూరులో ఉన్న సుబ్బారావు ఒక శుభముహూర్తాన సుందరితో చూపులు కలిపాడు. సుందరి కూడా తొలి చూపులోనే సుబ్బారావును ప్రేమించింది. ప్రేమించి, ప్రేమించబడి పెళ్ళి చేసుకున్న సుబ్బారావుకు ఇప్పుడు ఒక సమస్య ఎదురయింది. సుబ్బారావు వాళ్ళకు, ఊరిలో వారి తాతగారు కట్టించిన "రామాలయం" ఉంది. ప్రతి "శ్రీరామనవమికి", వాళ్ళ కుటుంబం పెద్ద ఎత్తున ఆ ఊరిలో మూడు రోజుల పాటు ఉత్సవాలు జరుపుతారు. సుబ్బారావు ప్రతి శ్రీరామనవమికి ఆ ఊరు వెళ్తాడు. ఈసారి "నవమి"కి సుందరిని వెంట పెట్టుకొని ఊరికి వెళ్ళాలని తెగ ఉత్సాహంగా ఉంది సుబ్బారావుకు. కాని సుందరికి సుబ్బారావు మీద ఉన్న ప్రేమ, అతని పల్లెటూరు మీద లేదు. గుంటూరు లాంటి పట్టణంలో పుట్టి పెరిగిన సుందరికి పల్లెలు అంటే తెగ అలర్జీ. అందుకే సుబ్బారావు వెంట ఊరికి రానంటే రానని మొండి కేసింది. సుబ్బారావు అలిగాడు. మూడు రోజులు ఇంట్లో తిండి మానేసి హోటల్స్ వెంట పడ్డాడు. అందుకే సుందరి కళ్ళకు సుబ్బారావు సగం చిక్కిపోయాడు. అతడు చిక్కిపోవడం చూడలేక చివరకు "సరే" అంది సుందరి. ఎగిరి గంతేసాడు సుబ్బారావు. ఆ సాయంత్రమే వెళ్ళి ట్రైన్‌కు రిజర్వేషన్ చేయించాడు. ప్రయాణం పొడుగునా తెగ జోరుగా ఉన్నాడు సుబ్బారావు. సుందరి మాత్రం కిటికీ ప్రక్క సీటులో మూతి ముడుచుకొని, కూర్చుంది. మధ్య మధ్యలో పేపర్ చాటు చేసుకొని, సుందరితో సరసాలాడ బోయాడు. సుందరి విసురుగా తోసి వేసింది అతని చేతులను. ఆమె రుసరుసలు, విసవిసల మధ్య అతని ఉత్సాహం నీరుగారి పోయింది. ఊరు చేరిన సుబ్బారావు ఇంట్లో సుందరిని వదిలిపెట్టి నవమి సంబరాలలో పడ్డాడు. ఊరిలో ఆటల పోటీలు నిర్వహించడం, గాన కచేరీలు ఏర్పాటు చెయ్యడంతో అతనికి క్షణం తీరిక లేదు. ఉత్సవాలు ముగిసిన తరువాత సుందరి–సుబ్బారావులు గుంటూరు ట్రైన్ ఎక్కారు.



"సారీ సుందరి! ఊరిలో నిన్ను అసలు పట్టించుకోనే లేదు కదూ! బాగా బోర్ కొట్టిందా?" పేపర్ చాటున సుందరి వేళ్ళని ఆప్యాయంగా నొక్కుతూ, నొచ్చుకుంటూ అడిగాడు. గుంటూరు వెళ్ళిన తరువాత తన పని పడుతుందని అతనికి లోపల భయంగానే ఉంది.

"అబ్బే అదేం లేదండీ.... మీ ఊరిలో ఆడవాళ్ళు ఎంత మంచి వాళ్ళండీ.... ఈసారి నవమికి కూడా వద్దాం.... ఏం...." దంగై పోయాడు సుబ్బారావు. వచ్చేటపుడు మూతి ముడుచుకొని కూర్చున్న సుందరి, తిరుగు ప్రయాణంలో తెగ ఉత్సాహంగా కబుర్లు చెప్పసాగింది. సుందరి ఉత్సాహానికి కారణం బుర్ర బద్దలు కొట్టుకున్నా అంతుబట్టలేదు సుబ్బారావుకు.

* * * *

ఊరి నుండి వచ్చిన నెల రోజుల తరువాత, ఒక రోజు ఎదో ఉత్తరం వచ్చింది అంటూ తెచ్చి ఇచ్చింది సుందరి. అది సుబ్బారావుకు వాళ్ళ అన్నయ్య వ్రాశాడు. అందులో వాళ్ళ అమ్మాయి "రజస్వల" అయినట్లు ఉంది. అదే విషయం చెప్పాడు సుందరితో.

"అలాగా! అయితే మరలా మనం మన ఊరు వెళ్ళాలి కదండీ! ఆ అమ్మాయికి మనం వేడుకలు చేయించాలిగా! ఎప్పుడు వెళ్దాం అంటారు?" చాలా సంతోషంగా అడిగింది.సుబ్బారావు తెల్లబోయాడు.

ఏమండీ.... మరలా వెళ్దామండీ.... మన ఊరు.... గారాలుపోతూ అంది సుందరి. ఆమెను ఆకర్షించింది ఆ ఊరిలో ఏముందో అర్థం కాలేదు సుబ్బారావుకు. అతనికి కూడా భార్యతో ప్రయాణం చెయ్యాలంటే మహా సరదాగా ఉంది. మరలా టికెట్స్ రిజర్వ్ చేయించాడు. ఈసారి సుందరి లగేజ్ ఒక పెద్ద సూట్‌కేసుకు తయారు చేసింది. అంత పెద్ద సూట్‌కేసును చూడగానే సుబ్బారావు విసుక్కున్నాడు. ఆమె అది ఏమీ పట్టించుకో లేదు. ఊరు వచ్చేంతవరకూ చాలా ఉషారుగా ఉంది సుందరి. ఇంటికి వచ్చిన తరువాత భోజనం చేసి ఊరిలో పడ్డాడు సుబ్బారావు. పాత స్నేహితులతో గడిపి, సాయంత్రం ఇంటికి వచ్చాడు. ఇంటిలో పలికి అడుగు పెట్టబోతూ ఒక్క క్షణం ఆగాడు. ఇంటి వసారా అంతా దాదాపు ఊరిలోని ఆడవాళ్ళతో నిండి ఉంది. వాళ్ళ మధ్యలో చాప మీద కూర్చొని ఉంది సుందరి. ఆమె వెంట తీసుకొచ్చిన సూట్‌కేస్ ఆమె ఎదురుగా ఉంది. దానిలోని చీరలు అన్ని కుప్పగా పరిచి ఉన్నాయి. ఆడవాళ్ళ చేతులలో సుందరి చీరలు! వాటిని వాళ్ళు తన్మయంగా చూస్తున్నారు. సుందరి గర్వంగా ఎదో చెప్పుకుపోతూ ఉంది.

"ఓలమ్మో.... ఎన్ని చీరలో! అబ్బో.... ఎంత బాగున్నాయో".... ఊరిలోని ఆడంగుల మాటలు సుబ్బారావు చెవికి వినపడుతూనే ఉన్నాయి. ■



# వ్యక్తిగతం



టర్కీ మాజీ అధ్యక్షుడు సెలాల్ బయర్ (104) ఇటీవలె ఇస్తాంబుల్‌లో మరణించారు. ప్రపంచంలోని వృద్ధ రాజకీయ వేత్తలలో ఒకరయిన బయర్, టర్కీ దేశానికి మూడవ అధ్యక్షునిగా దాదాపు పది సంవత్సరాల పాటు తమ సేవలను అందించారు. 1937–1939 మధ్య కాలంలో ఈయన ప్రధాన మంత్రిగా కూడా ఉన్నారు. 1961లో సైనిక తిరుగుబాటు జరిగి ఈయనకు పదవీచ్యుతి కలిగింది. అప్పటికే ఎనభై సంవత్సరాలు వయస్సు ఉన్న బయర్‌పై సైనిక ప్రభుత్వం సానుభూతి చూపించి ఉరి శిక్ష నుంచి ఆయనను మినహాయించింది. గత రెండు దశాబ్దాలుగా యువతరానికి మార్గదర్శకమైన స్థాయిలో ఈయన ఎంతో హుందాగా ప్రవర్తిస్తూ వచ్చారని ఆ ప్రభుత్వ వర్గాలే పేర్కొన్నాయి. టర్కీ తొలి పార్లమెంటు సభ్యులలో ఇప్పటి దాకా జీవించి ఉన్న వ్యక్తి ఈయన ఒక్కరే.....



వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్‌గా వరుసగా 13 సార్లు ఎన్నికై ప్రస్తుతం ఆ క్రీడకి దూరంగా ఉంటున్న బల్‌బీర్ సింగ్‌కి ప్రతిష్ఠాత్మకమైన "పియరి డి కౌబర్టన్ ట్రోఫీ" అవార్డు వచ్చినట్లు ఇటీవలే ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్ అధ్యక్షుడు వెల్లడించారు. ఈ అవార్డుని సెప్టెంబర్ 25న పారిస్‌లోని "యునెస్కో హవుస్"లో జరిగే ఒక ఉత్సవంలో బల్‌బీర్‌సింగ్‌కి అందజేయడం జరుగుతుంది. ఈయన వెయిట్ లిఫ్టింగ్‌లో పాల్గొన గలిగే దారుఢ్యం ఉంది కూడా 1973 తరువాత ఆ క్రీడలో పాల్గొన కుండా యువకులను ప్రోత్సహించడం మొదలు పెట్టారు. ఈయన ఇస్తున్న ప్రోత్సాహం మరువ లేనిదని ప్రఖ్యాత వెయిట్ లిఫ్టర్ దళ్‌బీర్ సింగ్ అన్నారు. బల్‌బీర్ సింగ్‌కి అవార్డులు రావడం కొత్త కాదు. గతంలో ఈయనకు అర్జున్ అవార్డు, 1970లో బాంకాక్‌లో జరిగిన ఆసియన్ క్రీడలలో కాంశ్య పతకమూ లభ్యమయ్యాయి. పారిస్ ప్రధాన కేంద్రంగా ఉన్న "ఇంటర్ నేషనల్ ఫెయిర్ ప్లే కమిటీ" సన్మానించ బోతున్న భారతీయులలో ఈయన మూడవవారు. మల్లయుద్ధ ప్రవీణుడు గురుహనుమాన్ మొదటివారు కాగా, బిలియర్డ్స్ ఛాంపియన్ మైఖేల్ ఫెరైరా రెండవవారు. నాలుగు రకాల వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో వరుసగా 13 సార్లు జాతీయ ఛాంపియన్ షిప్‌ను పొందిన ఏకైక భారతీయునిగా ఈయనకున్న స్థానాన్ని ఇంతవరకూ ఎవరూ అందుకోలేదు

# వారఫలం

## 3-10-1986 శుక్రవారం మొదలు 9-10-1986 గురువారం వరకు

★ **మేషం** : భారీ ఎత్తున జరిగే మీ వ్యాపారానికి, అనుకోకుండా అంతరాయం రావచ్చు. బెంగ పడకండి. ఓపికతో, సమర్థతతో సర్దుబాటు చేసికోండి. విద్యారంగాన ప్రగతి సాధింపగలరు. కొందరకు అనుకొనని రీతిన ద్రవ్యం అందుతుంది. స్త్రీలకు : వృత్తి యందు గౌరవం, అంతో యింతో ఆదాయం.

★ **వృషభం** : దూరపు బంధువులో, కావలసిన వారో హితులో యింటికి వస్తారు. శుభకార్యానుకూలత గలదు. నూతన వ్యక్తులతో పరిచయం, ఆదాయ మార్గం కాగలదు. స్థితి యందు పెంపు గల సమయం. స్త్రీలకు : అధికంగా ఖర్చులు తగులుతాయి. అనుకొన్నట్లుగా పనులు జరుగవు. కొంత చికాకు.

★ **మిధునం** : నూతన వృత్తిని చేపట్టాలనే తపన బయలుదేరుతుంది. దేనికైనా సమయం రావాలి గదా! ఇంకా కొంతకాలం వేచియుంటేనే గాని మేలు చేకూరదు. రాజకీయంగా పెద్దగా చెప్పదగిన మార్పు లుండవు. పరుల సహాయం లభిస్తుందని ధీమాగా ఉండవలసిన సమయం గాదు. స్త్రీలకు : వృత్తి యందు అంతరాయాలు, ధనలోపం, ప్రయాస.

★ **కర్కాటకం**: రాశిఫలం అనుకూలం. ఒక్క ఆరోగ్యమందు తప్ప యితర వ్యవహారాలందు మీకు అనుకూలమే. సమయానికి డబ్బు అందుతుంది. వృత్తి యందు వికాసమున్నది. చాల కాలంగా అందని 'యింక్రిమెంట్లు'గాని, 'ప్రమోషన్ గాని అందవచ్చు. రాజకీయంగా అనుకూలం గాదు. స్త్రీలకు : శుభకార్యాచరణమునకు అనుకూలం,

★ **సింహం** : విధి విరామం లేకుండా బాగా శ్రమిస్తారు. కొందరకు ఆరోగ్య భంగమున్నది. చాల యిబ్బందులకు దారి తీయగల వారం. కళారంగాన చిక్కినట్లే చిక్కి అవకాశాలు జారిపోతాయి. స్త్రీలకు : రాజకీయంగా మేలు, చెప్పదగిన ధనలబ్ధి, అనుకూలం.

★ **కన్య** : నూతనాంశాలు గ్రహింపదగిన కాలం. సంఘసేవ యందు కాలం వ్యయిస్తారు. ఒకానొక వ్యవహారంలో నిర్మాణాత్మకమైన కృషి జరుగుతుంది. శుభావహమైన వారం. స్త్రీలకు : ప్రభుత్వాదరణ. ఉద్యోగమందు మేలు. సభా గౌరవం కొందరకు అనుకూల వార్తాశ్రవణం కొందరకు.

★ **తుల** : విద్యా పరిశ్రమ ఫలవంతమవుతుంది. ఆరోగ్యమందు అభివృద్ధి కనిపిస్తుంది. స్థితిగతులందు కొంత మేలు కనిపిస్తుంది. 'ఇక జరుగదు' అనుకొన్న వ్యవహారం చకచకా సాగిపోతుంది. మిత్రాదరణ లభ్యమవుతుంది. స్త్రీలకు : డబ్బును గూర్చిన సమస్యలు ఎదురవుతాయి.

★ **వృశ్చికం** : ఇప్పుడిప్పుడే మీ రాశికి బలం చేకూరుచున్నది. అంటే క్రమంగా పుంజుకోగలరని భావం. చాలకాలంగా యితరుల చేజిక్కిన పైకం అందగలదనే ధైర్యం కనిపిస్తుంది. ఉద్యోగరీత్యా ఏర్పడిన అంతరాయాలు తొలగిపోతాయి. డబ్బును గూర్చిన చిక్కులు క్రమంగా తొలగిపోతాయి. స్త్రీలకు : సుఖానుభూతి, స్వల్పాదాయం.

★ **ధనుస్సు** : శుభ వర్తమానం అందుతుంది. అందవలసిన డబ్బు సమయానికి చేరుతుంది. వృత్తి యందు పెంపు కనిపిస్తుంది. తోడివారల సహాయం లభ్యమవుతుంది. లాభదాయకమైన ప్రయాణాలుంటాయి. అప్పుసప్పులు దొరుకుతాయి. చిరకాల వాంఛ వృత్తి సంబంధమైనది సఫలం. స్త్రీలకు : చిక్కులు తొలగి, హాయి, ప్రశాంతి చేకూరుతుంది.

★ **మకరం** : గృహ సంబంధంగా యిటీవల ఏర్పడిన అంతరాయాలు తొలగిపోతాయి. ధనవంతుల వలన గాని, పెద్దల వలన గాని' జరుగవలసిన పనులు నెరవేరుతాయి. వృత్తి యందు చెప్పుకో తగిన మార్పులు రానున్నాయి. నూతన వ్యాపారం ప్రారంభించుటకు తగిన సమయం. స్త్రీలకు : ధనలబ్ధి, స్థితి యందు పెంపు, స్థాన మార్పు కొందరకు.

★ **కుంభం** : 'అవునా? కాదా? నెరవేరునా? లేదా? సహాయం లభ్యమగునా?కాదా?' అను సందేహాలు వారాంతాన నివృత్తియగును. 'నల్లని' రంగు గల వస్తు విక్రేతలకు అనుకూల వారం. బంధువులో, మిత్రులో దూరభారాల నుండి యింటికి రాగల సమయం. స్త్రీలకు : నమ్మి మోసగింపబడటం, వృత్తి యందు మార్పు సంభవం.

★ **మీనం** : ఇటీవల సంభవించిన, వృత్తి సంబంధమైన యిబ్బందులు తొలగిపోతాయి. అనుకొన్న రీతిగా ధనసేకరణకు అవకాశమున్నది. కొందరకు గృహ లేక స్థాన మార్పు చెప్పదగియున్నది. ఉద్రేకంతో కొన్ని వ్యవహారాలు చెడుచుకొంటారేమో గమనించండి. స్త్రీలకు ధనాదాయం, ఇటీవల ఏర్పడిన చిక్కులు నివృత్తి కాగలవు, గ్రహించండి.

–విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి


సీక్రెట్ ఏజంట్
విక్రమ్
మోహన్
దిలీప్ కదమ్
5


పోలీసు కార్లు అన్ని వైపుల నుంచి రావటం చూసిన విక్రమ్ తన రివాల్వర్‌ని చెత్త కుండీలో జారవిడిచాడు
దానిని తర్వాత తీసుకుంటాను


చేతులు పైకెత్తి మాట్లాడకుండా కారెక్కండి
ఆఫీసర్ గారూ! నేను జరిగిందంతా చూసాను ఈయన నిరపరాధి.
అవును అతను మమ్మల్ని చంపటానికి ప్రయత్నించాడు అంతలో ఒక కారు వచ్చింది అతన్ని కాల్చి చంపారు


మీరెవరు?
విక్రమ్ శ్రీమతి కపూర్ ఉంటున్న హోటల్ మేనేజర్‌ని


అయినా వీళ్ళు పోలీస్ స్టేషన్‌కి రాక తప్పదు


పోలీస్ స్టేషన్‌లో –
నేను పోలీసు ప్రధానాధికారి బక్షీని నిజంగా జరిగింది పొరపాటే కానీ కొంత తప్పు మీది కూడా ఉన్నది మిస్టర్ కపూర్!
నా తప్పా? ఎలా?


మీ దగ్గర చాలా డబ్బుంది అది మంచిది కాదు మీ కాగితాలు ఒకసారి చూడవచ్చా?
అవి హోటల్‌లో ఉన్నాయి


అయితే మీరు వాటిని తీసుకు రావాల్సి ఉంటుంది మీతో పాటు నా మనుషులు వస్తారు
చూడండి! నే నొక పర్యాటకుడిని సరదాగా గడుపుదామని వచ్చాను కానీ మీ వల్ల ఇబ్బంది పడటానికి రాలేదు


విక్రమ్ నోట్ల కట్ట ఒకటి బయటికి తీస్తాడు
దీనితో మీ లాంఛనాలన్నీ పూర్తవుతాయని భావిస్తాను
తప్పకుండా అలాగే మిస్టర్ కపూర్! మా వల్ల ఇక మీ కెలాంటి అసౌకర్యం కలగదు


ఇక ముందు మరింత జాగ్రత్తగా ఉండండి మిస్టర్ కపూర్
ఉంటాను
(ఇంకా ఉంది)

# హైదరాబాద్ నోట్ బుక్

## శ్రీ కవిపురపు కామేశ్వరరావు:–

సమాన శీల వ్యసనేషు సఖ్యం– సమానమైన మంచీ చెడూ వున్న వారికి మైత్రి కలుస్తుంది– అనేది అభాణకం. ఈ విధంగానే సమానవృత్తి కులాల ప్రాదుర్భావానికి కారణమైంది. కులమంటే సమూహమని, గుంపని సామాన్యార్థమైనా, ఒక వృత్తికీ, ఒక విశిష్టాచార సంప్రదాయ సంస్కృతులు గల వర్గానికి రూఢమయింది. మన దేశంలో ఈ పద్ధతి ఎన్నో వేల యేళ్ళనాడే పాతుకుంది. సమాజ కేంద్రంగా, ప్రధాన జీవన స్రోతస్సుగావున్న యజ్ఞం, యజ్ఞ పురుషుడు అప్పుడప్పుడే రూపు దాల్చుతున్న సంఘ వ్యవస్థకు ప్రతీకగా స్తుతింపబడడం పురుష సూక్తంలో కనిపిస్తుంది. కాని ఇది ఎప్పుడు బలపడిందో, సీసం పోసినట్టు బలపడింది. దీనిని నిరసిస్తూ, ఉపనిషత్తులు మొదలు నేటి వరకు ప్రతి ఋషి, ప్రతి వేదాంతి, ప్రతి భక్తుడు, ప్రతి ఆచార్యుడూ– నెత్తిన నోరు పెట్టుకొని అరుస్తున్నా, ఇది సడలినట్టే సడలి, మరింత బిగుసుకు పోతున్నది. జ్ఞానం ప్రధానం, కులం కాదని రైక్వుడు చెప్పాడు. రామానుజుల గురువులలో పలువురు బ్రాహ్మణేతరులు, ఆయన కాలంలో విశిష్టాద్వైతులలో కులం తల ఎత్తలేదు గాని, ఆయన ఆచార్య తిరువడి చేరిన వెంటనే పడగవిప్పింది. ఇక శైవులలో బ్రాహ్మ్యాన్ని, శివభక్తిని విడనాడని బలమైన కులం ఏర్పడింది. ప్రస్తుతం రాజకీయాలు పైకి ఎవరేమి చెప్పినా కులంపైనే నడుస్తున్నాయి గనుక, కులమనేది ఇప్పట్లో పోదు కనుక, ప్రతి కులమూ తన శ్రేయస్సుకు పాటుపడడం సహజం. అలా ఏర్పడింది 1981లో ఆంధ్రప్రదేశ్ బ్రాహ్మణ సేవా సంఘ సమాఖ్య. ఈ సమాఖ్య సర్వ సభ్య సమావేశం ఆగస్టు 16,17 తేదిలలో వరంగల్లులో జరిగి, కార్యనిర్వాహక వర్గాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకొంది. హైదరాబాద్ ఎ.బి.సి.డి. సంస్థ (ఆల్ బ్రాహ్మిన్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్) కార్యదర్శి శ్రీ కవిపురపు కామేశ్వరరావు అధ్యక్షులుగాను, శ్రీ టి.వి. శ్రీనివాసరావు ప్రధాన కార్యదర్శిగాను, శ్రీ వి. వెంకటరావు కోశాధికారిగాను ఎన్నికయ్యారు. రాష్ట్రంలోని మూడు ప్రాంతాల నుండి ఆరుగురు ఉపాధ్యక్షులు, ఆరుగురు కార్యదర్శులు, ఎన్నికయ్యారు. రాష్ట్ర మంతటా వ్యాపించి వున్న 140 సంఘాలు ఈ సమాఖ్యకు అనుబంధంగా వున్నాయి. కార్య నిర్వాహక వర్గంలో ప్రతి జిల్లా నుంచి ఇద్దరు ప్రతినిధులు ఎన్నికయ్యారు. ఈ సంస్థ బ్రాహ్మణులలో ఐకమత్యసాధనకు, సంక్షేమానికి కృషి చేస్తున్నది. 1981 నుంచి ఎ బి సి డి సంస్థకు కార్యదర్శిగా వున్న శ్రీ కవిపురపు కామేశ్వరరావు జంట నగరాలలో ఏటా మహాసభ నిర్వహించారు. 1983 జులైలో జరిగిన మహాసభకు అప్పటి పంచాయతీరాజ్ శాఖామాత్యులు శ్రీ కరణం రామచంద్రరావు ప్రారంభోత్సవం జరిపారు. ఈ సంస్థ సాంఘికంగాను, ఆర్థికంగాను సేవ చేస్తున్నది. ఏటా మూడు నెలల కొకసారి వివాహపరిచయ వేదికలను నిర్వహించి, కట్నాలు, ఆడంబరాలు లేకుండా వివాహాలు ఏర్పాటు చేస్తున్నది. నిరుటి వరకు ఈ వేదిక పన్నెండుసార్లు జరిగింది. ఇది చాల ప్రయోజనకరంగానిరూపిత మైంది. శ్రీ కామేశ్వరరావు ప్రభుత్వానుమతితో లక్కీడిప్ లాటరి ఏర్పాటు చేసి, "దరిద్ర విద్యార్థుల నిధి"కి దాదాపు 18 వేల రూపాయలు సేకరించారు. సంస్థ నిధి కూడ 25 వేలకు పెరిగింది. ఈ మొత్తాన్ని ఫిక్సెడ్ డిపాజిట్లో భద్రపరచారు. ఏటా 50 మంది విద్యార్థులకు పుస్తకాలకుగాని, దుస్తులకుగాని 50 రూపాయల ప్రకారం సహాయం చేస్తున్నారు. 1985 నుంచి కాలేజీ విద్యార్థులకు కూడ దాదాపు 25 మందికి నెలనెలా 75 రూపాయలు విద్యార్థి వేతనం ఇచ్చే ఏర్పాటు చేశారు. ఈ విధంగా ఏటా 24 మంది బీద ఇంజనీరింగ్, మెడికల్, పోస్ట్ గ్రాజుఏట్, గ్రేజుఏట్, అండర్ గ్యాజుఏట్ విద్యార్థులకు 14 వేల రూపాయల మేర సహాయం చేస్తున్నారు. కొందరు విద్యార్థులకు పాఠ్య పుస్తకాల కోసం 200 రూపాయలు ఇస్తున్నారు. శ్రీ కామేశ్వరరావు రాష్ట్ర ప్రభుత్వ గృహ నిర్మాణ సంస్థలో లా ఆఫీసర్‌గా పదవీ



విరమణ చేశారు. ప్రస్తుతం అద్వకేటుగా పని చేస్తున్నారు. అద్వకేటుగా సంపాదించిన మొత్తాన్ని బ్రాహ్మణ సంఘ శ్రేయస్సుకు వినియోగించాలని నిర్ణయించు కొన్నారు. తమ తలిదండ్రులు శ్రీ కృష్ణరావు, భ్రమరాంబల పేర ఒక నిధిని ఏర్పాటు చేశారు. దీనికి ఈయన సోదరులు, ఐ.ఐ.టి.లో ప్రొఫెసర్ శ్రీ కవిపురపు శ్రీ రాం 10 వేల రూపాయలు విరాళమిచ్చారు. ఈ నిధికి 1984 అక్టోబరులో శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ (ఐ.ఎ.ఎస్) ప్రారంభోత్సవం జరిపారు. తొలి విద్యార్థి వేతనాన్ని శ్రీ ఎల్. వి. వి. సుబ్రహ్మణ్యం (ఐ. పి. ఎస్.) విద్యార్థులకు అందజేశారు. ఈ నిధి ద్వారా శ్రీ కామేశ్వరరావు ఒక సి. ఎ. విద్యార్థికి ఒక ఇంజనీరింగ్ విద్యార్థికి, ఒక అండర్ గ్రాజుఏట్ విద్యార్థికి నెలకు చెరి 75 రూపాయల విద్యార్థి వేతనం ఇస్తున్నారు. శ్రీ కామేశ్వరరావు నల్లకుంటలోని బ్రాహ్మణ విద్యార్థి వసతి గృహానికి కార్యదర్శిగా వుంటూ, 40 మంది విద్యార్థులకు వసతి కల్పించారు. పాత ఋణాలు తీర్చారు. బ్రాహ్మణ విద్యార్థుల కోసం సైఫాబాదులో మాతృశ్రీ ఎడుకేషన్ సొసైటీ నిర్వహిస్తున్న మాటూరి వెంకటసుబ్బారావు ఇంజనీరింగ్ కళాశాలకు ఈయన వ్యవహర్త. ఇది ఈయన మార్గదర్శకత్వంలో బాలారిష్టాలు దాటి జంటనగరాలలోని ఉత్తమ ఇంజనీరింగ్ కళాశాలలో ఒకటిగా పేరుప్రఖ్యాతులుపొందింది. శ్రీ కామేశ్వరరావు సాంస్కృతిక రంగంలోను ప్రముఖులే. ఈయన 1951లో ఇండియన్ నేషనల్ థియేటర్‌ను స్థాపించారు. కనుక ఐ. ఎన్. టి. కామేశ్వరరావనే ఈయనకు అడ్డ పేరు. ఈయన సంగీత నాటక అకాదమిలో [illegible] సంవత్సరాలకు పైగా సభ్యులుగా వున్నారు. ఇండియన్ నేషనల్ థియేటర్ మంచి పేరుగల సాంస్కృతిక సంస్థ. చార్మినార్ చౌరస్తా నుంచి ఇందిరా పార్క్‌కు వెళ్లే దారిలోని జవహర్‌నగర్‌లో ఈ సంస్థకు ఆరుబయలు రంగస్థలం వుంది. జంటనగరాలలో సొంత రంగస్థలమున్న నాటక సంస్థ ఇదేనేమో! ప్రస్తుతం ఈయన ఈ సంస్థకు ఉపాధ్యక్షులు. ఈయన ఉత్తమ నటుడు. పెక్కు పోటీలలో బహుమతులు సంపాదించారు. ఇంతటి విస్తృతమైన అనుభవమున్న శ్రీ కామేశ్వరరావు అధ్యక్షతలో ఆంధ్రప్రదేశ్ బ్రాహ్మణ సేవా సంఘ సమాఖ్య ఉన్నతిని పొంది, నిర్మాణాత్మక కృషి జరుపగలదని ఆశిస్తున్నాను. ఒక యంత్రంలో చిన్న మర మొదలు అన్నీ ముఖ్యమైనట్లే, అన్ని వర్గాలూ ముఖ్యమే; హెచ్చుతగ్గులనేవే లేవు. కనుక ఈ సంస్థ బ్రాహ్మణులు గొప్పవారనే భావాలు మాని సంఘంలో ప్రధాన స్రవంతిలో తామూ ఒక భాగమనే

దృష్టితో ఇతర వర్గాలకు అవిరోధంగా పాటుపడగలదని, ఇతర సంఘాలకు ఒరవడిగా సేవ నిర్వహించగలదని ఆశిస్తున్నాను. నిజానికి బ్రాహ్మణత్వం మానసిక స్థితేకాని, సంఘ వ్యవస్థకు సంబంధించిందికాదు. చదువు చెప్పేవాడు, వ్యాపారం చేసేవాడు, దేశరక్షణకో, సంఘ రక్షణకో ఆయుధాలు ధరించేవాడు, మనస్సును ఆహ్లాదపరిచే కళలను తీర్చిదిద్దేవాడు -అందరూ అవసరమే. ప్రతి పనికీ తెలివితేటలు కావాలి. తెలివితేటలు ఒకరి గుత్త సొమ్ము కాదు. జ్ఞానవంతుణ్ణి ఎప్పుడూ గౌరవిస్తూనే వున్నారు.వారి కులమతాలను పట్టించుకొన్నవారే లేరు. దీనికి నేడు కోకొల్లలుగా సాక్ష్యాలు చూడవచ్చు. అలాటి మనస్థితిని అలవర్చుకున్నప్పుడే మనువు చెప్పిన "ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్ర జన్మనః, స్వంస్వం చరిత్రం శిక్షేరన్" అనే మాట పొసగుతుంది. శ్రీ కామేశ్వరరావు ఆర్థిక సాంఘిక దృష్టితో నే కాక, తమ సంఘీయులు మానసికంగాను ఉన్నతిని సంపాదించడానికి కృషి చేయాలని కోరుతున్నాను.



ఆంధ్ర సారస్వత సమితి (మచిలీపట్నం) 20వ వార్షికోత్సవం సందర్భంగా బందరు పురమందిరంలో సెప్టెంబరు 13వ తేదీన జరిగిన సాహిత్య సభలో నివేదిక సమర్పిస్తున్న సమితి కార్యదర్శి శ్రీ జి. బాలస్వామి. వేదిక నలంకరించిన సభాధ్యక్షులు ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ, ప్రఖ్యాత రచయిత డా. రావూరి భరద్వాజ, ఆంధ్రప్రదేశ్ చేనేత, జౌళి పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ ఎం. కాశి రెడ్డి, కస్తూర్బా మహిళా కళాశాల (సికింద్రాబాదు) ప్రిన్సిపాల్ శ్రీమతి ఎ. విద్యారాణి, ప్రముఖ రచయిత ఆచార్య తిరుమల గార్లని చిత్రంలో చూడవచ్చు..

### ఉపశ్రుతి:-

రిజర్వేషన్ల పోరాటంలో ఎవరు గెలిచారంటారు? - అని ప్రశ్నించారు మిత్రులు ఎ. వి. ప్రసాద్‌గారు. సుఖ దుఃఖాలు, లాభా లాభాలు, జయాపజయాలు సమానంగా భావించి పోరాడమన్నాడండీ మా రాజకయ గురుపు కృష్ణుడు- అన్నారు మా పక్కనవున్న రాజకీయ వేదాంతి.

—తిరుమల రామచంద్ర

పట్టించుకున్న నాథుడు లేదు. ఎర్షాద్ లాంటి వారిని ఎవరు పట్టించుకుంటారు. ఆయన తమ ప్రజల డబ్బునే దోచేస్తున్నాడు. ఆ లండన్ పత్రిక రాసినట్లు ప్రపంచం అంతటా ఉంపుడు కత్తెలని ఆయన పోషిస్తున్నాడు, తన దేశానికి సహాయం కోసం ఇచ్చిన ప్రతి డాలర్‌లోనూ భాగం తీసుకుంటున్నాడు. అలాంటి వ్యక్తి మాటలని ఎవరు పట్టించుకుంటారు? భారత దేశం ప్రధాన మంత్రిగా శ్రీమతి గాంధీని కూడా అంతగా పట్టించుకోక పోవటానికి గల కారణాలలో ఒకటి ఆమె లేదా ఆమె కుటుంబంలోని వారు తమ జేబులని నింపుకుంటున్నారనే సందేహం కలగటం వల్లనే అయి ఉండవచ్చు. పాశ్చాత్య దేశాలకి చెందిన నాయకుల మీద కూడా ఇటు వంటి పుకార్లే ఉన్నాయని మీరు అనవచ్చు. నిజమే. కానీ ఆ నాయకులు తమ చేతులలో భిక్షాపాత్రతో తిరగటం లేదు కదా! శాంతి, స్వేచ్ఛ, సార్వభౌమాధి కారాల గురించి మీరు ప్రపంచానికి ఉపన్యాసాలు ఇవ్వలేరు, ఎందుకంటే ఆ తర్వాత చదీ చప్పుడూ లేకుండా పెరటి దారిన 10, డౌనింగ్ స్ట్రీట్‌కో, వైట్ హౌస్‌కో వెళ్లి సైనిక, ఆర్థిక సహాయం కోసం చేయి చాపుతారు. ఆ సహాయానికీ దానికీ ముడి పడి ఉన్నదని మీకు తెలుసు.

## న్యూఢిల్లీ లేఖ

( 4 వ పేజీ తరువాయి)

అందువల్ల రాజీవ్ గాంధీ లేదా ముగాబే లేక కౌండా ఎలుగెత్తి ఒక కొత్త అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ గురించి పిలుపు ఇస్తే ప్రపంచం దానిని పట్టించుకోదు. ఉన్నత స్థానంలో ఉన్న ఎర్షాద్ వంటి వ్యక్తి పై దొంగతనం - అవినీతి అంటే అంతకన్నా ఏమీకాదు- ఆరోపణ ఉన్నప్పుడు ఆయన క్రింది ఉద్యోగులు సవ్యంగా ఎలా ఉంటారు? నేడు భారత దేశంలో మీరు ఒక టికెట్ కలెక్టర్‌నే కాక స్టేషన్ మాస్టర్‌ని కూడా సంతృప్తి పరచ వలసి రావచ్చు. కొన్ని వాగన్‌ల బొగ్గు కావాలంటే బహుశ ఉన్నత రైల్వే అధికారి చేయి తడపక తప్పక పోవచ్చు. నైజీరియాలో జరిగే వ్యవహారాలలో అక్కడి మంత్రులు బహిరంగంగానే లంచాలు అడుగుతారు. ఒక కంట్రాక్టరు తన కాంట్రాక్టు మొత్తంలో 10 నుంచి 20 శాతం వరకూ అధికారులకి, మంత్రులకి, వాళ్ల భార్యలకి, ఉంపుడుకత్తెలకి భాగం ఇవ్వటానికి కొంత మొత్తాన్ని తీసి వేరుగా పెట్టుకోవలసి ఉంటుంది. ఇప్పటి వరకూ భారతదేశంలో పరిస్థితి మరీ అంత చెడుగా లేదు. అయితే మనం కూడా నెమ్మదిగా అదే దిశగా వెళుతున్నాము. దేశంలో రాజకీయాలు ఎంత ఎక్కువైతే అవినీతి అంత ఎక్కువ అవుతుంది. రమేష్ భండారి వంటి వ్యక్తులు రాత్రికి రాత్రే అధికార పార్టీ కార్యాలయాలలో తమ రాజకీయ వర్గానికి చెందిన కొత్త వేషంతో కనిపిస్తే ఇక అక్కడి నుంచి ఆ విషయమే అందరి నోళ్లలో ఉంటుంది.

మనమంతా అవినీతి పరులమని చెప్పుకోవటం శుద్ధ దండుగ. ఒకరు రు. ఒక కోటి తీసుకున్నా, మరొకరు 10 కోట్లు తీసుకున్నా అందులో పెద్ద తేడా ఏముంది? చాలా ఉన్నది! ఎర్షాద్ క్రింది అధికారులు డబ్బు తీసుకుంటున్నారన్నది వాస్తవమే. కానీ ఎర్షాద్ కూడా తమ జేబులు నింపుకుంటున్నారన్నది అంతకు మించిన నిజం. సింగపూర్ లాంటి అతి చిన్న దేశం అంత బాగా ఉండటానికి ఒకే ఒక్క కారణం ఉన్నది. జపాన్ తర్వాత ఆసియాలో అతి ఎక్కువ తలసరి ఆదాయం కల దేశం అది. ఆ దేశంలోని నాయకులు అవినీతికీ, అనుమానాలకీ అతీతులు. ప్రపంచంలోని అతి పేదదేశాలలో భారతదేశం బంగ్లాదేశ్‌లు ఉండటానికి కారణం అవినీతి పరులైన వారిలో మన నాయకులు కూడా ఉండటమే నని తేలికగా అర్థం అవుతుంది. ☐

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,*
*by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor: S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*

విజయదశమికి
విజయ విహారం !

# సినిమా రంజని



ఆంధ్రుల అభిమాన
సంస్థ

**ఆంధ్రపత్రిక**

నుంచి

నవరసాలవిందుగా,
పసందుగా,
దసరాకు
మీముందుకువస్తోంది!

తారాపథానికికరదీపిక !!

వారం! వారం!! సుమచిత్రహారం సినిమా రంజని

# హెల్మెట్లు తప్పనిసరి

-శేఖర్.

మా ఆవిడ దెబ్బలను నా తల గట్టి పడిపోయింది ఇక హెల్మెట్ పెట్టక పోయినా ఫర్వాలేదంట్టే ఎట్టాగయ్యా ?!!



మా వారు నాల్రోజుల్లో హెల్మెట్ కొంటారంటగానీ అంత వరకు నాస్త మీ వారిది ఎరువిప్పించండి పిన్నిగారు !!!




హెల్మెట్ పెట్టుకోవాల్సింది ఇలాక్కాదని తెల్సులే! కాని ఎదురుగా అప్పులోడు వస్తున్నాడు మరి. !!!



హెల్మెట్ పెట్టుకోవాల్సింది బయటుండే ఇంట్లో కాదు తెల్సు! కాని ఇంట్లో కూడా సేఫ్టీగా వుంటుందని !!!



క హెల్మెట్ పెట్టక పోయినా ఫర్వాలేదు లెండి! తల కేం దెబ్బ తగలకుండానే చూస్కుంటాగా !!!



నువ్ ముందు హెల్మెట్ కొనేసుక్కొచ్చోని నన్ను స్కూటర్ కొనమని ప్రాణం తీస్తే ఎలాగబ్బాయ్ ?!!

